Rawaadari-Hindustani Samaaj Mein
(Telugu)

## భారతీయ సమాజంలో

# పరమత సహనం

మూలం:
అబుల్ ఫహమ్ వహీద్ అలీ ఖాన్

అనువాదం:
ముహమ్మద్ అజీజుర్రహ్మాన్

# విషయసూచిక

★ ★ ★

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# 1. పీఠిక

భారతదేశం భిన్న మతాల; భిన్న సంస్కృతుల సంగమం. వేలాది సంవత్సరాలుగా ఈ దేశం గంగా యమునల సంస్కృతిని తన ఒడిలో పెంచి పోషించుకుంటూ వస్తోంది. ఈ కోణం నుంచి చూసినప్పుడు ప్రపంచంలోని మరే దేశమూ మన దేశంతో బహుశా సరితూగదేమో! ఈ నందనవనంలో రంగురంగుల మొగ్గలు వికసిస్తున్నాయి. ఇక్కడ నివసించే వారంతా ఈ సత్యాన్ని జీర్ణించుకోవాలి. ఒకరి విశ్వాసాలను, సిద్ధాంతాలను బలవంతంగా అణచివేసే బదులు "ప్రతి పువ్వునూ వికసించనివ్వండి" అనే విధానాన్ని ఒంటబట్టించుకోవాలి. అన్ని మతాల, అన్ని వర్గాలవారు తమ హక్కుల్ని అనుభవించేందుకు, తమ బాధ్యతల్ని సక్రమంగా నిర్వర్తించేందుకు, దేశ నిర్మాణంలో తమ పాత్రను సజావుగా పోషించేందుకు అనువైన పరిస్థితులు నెలకొని ఉండేలా అందరూ మసలుకోవాలి. అప్పుడే ఈ నందనవనం తన వైశిష్ట్యాన్ని కాపాడుకోగలుగుతుంది. మరి ఈ వైశిష్ట్యమే దేశాభివృద్ధికి దోహదకారి కాగలుగుతుంది.

భారతీయ సమాజం గత చరిత్రను మనం తరచి చూస్తే మన పూర్వీకులు ఈ విషయంలో మన కొరకు ఎంతో అమూల్యమైన సంపదను సమకూర్చి పెట్టారన్న సంగతి తప్పక బోధపడుతుంది. మన గతమంతా సహనం, సంయమనం, న్యాయశీలం, త్యాగభావం వంటి దేదీప్యమానమైన ఉపమానాలతో నిండి ఉంది. భారతదేశంలోని రెండు పెద్ద మత వర్గాలవారు- హిందూ ముస్లింలు- సాగిస్తూ వస్తున్న జీవనయాత్రలో అవాంఛనీయ సంఘటనలు, ఉద్రిక్తతలు, సంఘర్షణలు తలెత్తలేదని కాదు- అయినప్పటికీ ఈ రెండు వర్గాల మధ్య సర్వసాధారణంగా ఏర్పడిన ప్రేమానురాగాల బంధాలు అపురూపమైనవి. గ్రామస్థాయిలో వారి మధ్య గొడవలు జరిగినై. కక్షలు,

కార్పణ్యాలతో పట్టణాలు కూడా కలుషితం కాకపోలేదు. గుప్పెడు మంది అసాంఘీక, విచ్ఛిన్నకర శక్తుల చలువ వల్ల అనూహ్యమైన అమానుషాలు జరిగిపోయాయి. కాని దేశంలోని జనసామాన్యం మాత్రం ఇలాంటి వాటిని ఎన్నడూ కాంక్షించలేదు. ప్రజాబాహుళ్యం మాత్రం నిత్యం 'సహిష్ణుత', 'సద్భావన' లకు సంబంధించిన గొప్ప దృష్టాంతాలనే నెలకొల్పింది.

ఈ ఆదర్శాలను కాపాడుకోవటం, వాటిని పెంపొందించుకోవటం, దైనందిన జీవితంలో వాటి అన్వయింపుకై కృషి చేయటం మన జాతీయ జీవనంలో ప్రధాన ధ్యేయం కావాలి.

అయితే మన చరిత్రకారులు, ముఖ్యంగా అధునాతన చరిత్రకారులు అవలంబించిన సంకుచిత వైఖరి క్షంతవ్యం కానిది. భారతదేశ చరిత్రను లిఖించే సమయంలో వారు - నిగ్రహాన్ని, దూరదృష్టినీ కోల్పోయి- విభిన్న వర్గాల మధ్య చిచ్చుపెట్టే ఉద్దేశ్యంతో ఆంగ్లేయులు భూతద్దంలో చూపెట్టిన విషయాలనే పదే పదే పునరావృతం చేశారు. తత్ఫలితంగా నేడు చరిత్రను అధ్యయనం చేసే విద్యార్థి మాజీలో ఉన్న భారతీయ సమాజంలోని సహనం, సామరస్యం, సహానుభూతి వంటి గుణాలను తగురీతిన ఆస్వాదించలేకపోయాడు. దీనివల్ల అతనిలో స్వతహాగా ఈ సహనశీలం జనించలేకపోయింది.

అందువల్ల భారతదేశ చరిత్రను ఈ కోణం నుంచి కూడా అధ్యయనం చేయవలసిన అవసరాన్ని, జ్యోతిర్మయమైన ఈ ఆదర్శాలను కూడా చరిత్రకెక్కించవలసిన ఆవశ్యకతను గుర్తించి ఈ ప్రయత్నానికి ఉపక్రమించటం జరిగింది. మన మహనీయుల ఉదాత్త, సహజీవన భావనలను నవతరం పుణికిపుచ్చుకోవాలన్నదే మా ముఖ్యోద్దేశం. ఈ ఉద్దేశ్యంతోనే కొన్ని చారిత్రక సంఘటనలను, పూర్వీకుల విశాల దృక్పథానికి అద్దంపట్టే అంశాలను సంకలనం చేసే ప్రయత్నం చేశాము.

ఈ పుస్తకంలోని సంఘటనలన్నీ గతకాలంలో జరిగినవే. మన దేశ చరిత్రలోని అన్ని కాలాలతో, అన్ని వర్గాలతో ముడిపడివున్న సంఘటనలే! సాధ్యమైనంత వరకు హిందూ-ముస్లింలకు సంబంధించిన వివిధ కాలాల

ఘటనలనే కూర్చే ప్రయత్నం చేశాము. అయితే ఈ కూర్పులో మేము చారిత్రక నిబంధనలను ఉద్దేశ్యపూర్వకంగానే ఉపేక్షించి అంశాలవారీగా మాత్రమే సంఘటనలను తీసుకున్నాము. అందుకే ఇందలి విషయాలు మీకు చారిత్రక క్రమంలో దొరకవు. ఎందుకంటే చరిత్రను వివరించటం ఈ పుస్తకం అసలు ఉద్దేశం కాదు- నవ సమాజంలో సహనగుణాలు, సహజీవన భావనలు వ్రేళ్ళూనుకోవాలన్నదే మా ఆశయం, ఆరాటమూను.

ఈ ఆదర్శాలు సజీవంగా ఉండేలా చూసుకోవాలనీ, ఈ అమూల్య సంపదను పెంచుకునేందుకు నిత్యం పాటుపడాలనీ ఈ ఘటనలు మనకు చెప్పకనే చెబుతున్నాయి. ఈ వెలుగు స్తంభాల ద్వారా మనం మన ఉజ్వల భవిష్యత్ పథాన్ని నిర్దేశించుకోవచ్చు. భారతీయ సమాజ నిర్మాణంలో, పురోగతిలో "సహన భావానికి" గల ప్రాముఖ్యతను ఈ ఉపమానాల ద్వారా ఆకళింపు చేసుకోవటానికి అట్టే సమయం అక్కరలేదు. ఇక్కడ నివసించే భిన్న మతాల, భిన్న విశ్వాసాల ప్రజలు తమ తమ అభిమతంపై స్థిరంగా ఉంటూనే ఇతరుల విశ్వాసాలను ఎలా గుర్తించి గౌరవించేవారో ఇందలి సంఘటనలు మనకు చాటిచెబుతున్నాయి. అంతేకాదు, ఎదుటి వారి విశ్వాసాన్ని గౌరవించే ప్రయత్నంలో మనిషి తాను ప్రాణప్రదంగా ప్రేమించే తన విశ్వాసాన్ని పరిత్యజించవలసిన అవసరం కూడా లేదనీ, తన విశ్వాసంపై చెక్కుచెదరని స్థయిర్యాన్ని కనబరుస్తూ కూడా ఇతరుల విశ్వాసాలను ఆదరించవచ్చనీ ఈ దృష్టాంతాలు మనకు బోధపరుస్తున్నాయి.

చరిత్ర చేసేదొక్కటే...

అది మంచీ చెడుల గతాన్ని మన ముందుంచుతుంది. మాపై గల ఒక బాధ్యతను మేము నిర్వర్తించాము.

అదే.... ఈ చరిత్రలోని ఉపయోగకరమయిన, శ్రేయోదాయకమయిన కోణాలను వెలికితీసి మీ ముందుంచాము. ఇప్పుడు మీరు నెరవేర్చవలసిన బాధ్యత కూడా ఒకటుంది....

అదేమిటంటే, మీరు ఇందలి మంచి విషయాలను ఆదర్శంగా తీసుకుని; వాటిని అనుసరించి చరిత్రలో మరిన్ని సువర్ణ ఘట్టాలను ఆవిష్కరించాలి.

ఆహ్లాదకరమయిన, సమరసభరితమయిన ఈ జాబితాలో మిమ్మల్ని కూడా అంతర్భాగం చేసుకోండి.

మరి ఈ కర్తవ్యాన్ని నెరవేర్చడం మీకిష్టమే కదూ!? ఈ పుస్తక సంకలనంలో మమ్మల్ని వెన్నుతట్టి ప్రోత్సహించిన వ్యక్తులకు, సంస్థలకు కృతజ్ఞతలు తెలుపుకోవటం మా నైతిక బాధ్యతగా భావిస్తున్నాము. ముఖ్యంగా స్టేట్ లైబ్రరీ (గతంలో అసఫియా లైబ్రరీ) నిర్వాహకులకు నేను రుణపడి ఉంటాను. విజ్ఞాన సంపద పట్ల వారికి గల అపారమయిన మక్కువ మూలంగా నేను స్వల్ప వ్యవధిలోనే ఈ పుస్తక భాండాగారం నుంచి కావలసిన వాటినల్లా సులువుగా సేకరించగలిగాను.

-అబూ ఫహమ్ వహీద్ హైదరాబాదీ

# 2. రాగద్వేషాలకు అతీతమైన న్యాయం

మాలాబార్‌లో ఒక ప్రాచీన దేవాలయముంది. వేలాది మంది హిందువులు అక్కడి తీర్థయాత్రలు చేస్తారు. టీపుసుల్తాన్ మాలాబార్‌ను జయించి ఈ దేవాలయం వద్దకు సమీపిస్తున్నప్పుడు అక్కడి పూజారులు ఆందోళన చెంది అక్కడి ప్రాచీన విగ్రహాలను ట్రావెన్కోర్ (తిరువనంతపురం)కు చెందిన ఓ ప్రసిద్ధ మందిరానికి తరలించారు. టీపుసుల్తాన్ గురవాయూరు వరకూ వచ్చి అక్కడి నుండే తిరోన్ముఖుడయ్యాడు. అయితే ఆ ప్రాంతాన్ని తన రాజ్య పరిధిలోకి తీసుకునే ఉద్దేశ్యంతో కొంత సైన్యాన్ని అక్కడికి పంపించాడు. సైన్యం ఆ ప్రాంతాన్ని జయించి దాన్ని తన ఆధీనంలోకి తీసేసుకుంది. ఆ రోజుల్లో మరాఠాలకు-ముస్లిము రాజులకు మధ్య యుద్ధాలు జరుగుతూ ఉండేవి. ప్రతీకార వాంఛతో పేట్రేగుతున్న కొంతమంది ఔత్సాహిక సైనికులకు దేవాలయాన్ని దహనం చేయాలన్న దుర్బుద్ధి పుట్టింది. అంత పనీ చేశారు కూడా. కొంత మంది సైనికులు దేవాలయ గోడలపై నెయ్యి జిమ్మి నిప్పు పెట్టారు. కట్టడంలో కొద్ది భాగం కాలేసరికే సైనికాధికారులకు సుల్తాన్ ఆదేశాలు జ్ఞప్తికి వచ్చాయి. వాళ్ళు వెంటనే నిప్పును ఆర్పేసి ముగ్గురు పూజారులను, ఆవేశపూరిత సిపాయిలను గురించి ఫిర్యాదు చేసే నిమిత్తం సుల్తాన్ వద్దకు పంపించారు.

పూజారుల ద్వారా ఫిర్యాదు విన్నంతనే సుల్తాన్ భృకుటి ముడిపడింది. ముఖకవళికలు మారిపోయాయి. కళ్ళు నిప్పులు చెరిగాయి. రాత్రికి రాత్రే ప్రయాణం చేసి దేవాలయానికి చేరుకున్నాడు సుల్తాన్. దేవాలయాన్ని దహనం చేయబూనిన సైనిక జవాన్లను కఠినంగా శిక్షించడమేగాక కాలిపోయిన భాగాన్ని యుద్ధప్రాతిపదికపై మరమ్మత్తు చేయించాడు. అంతే కాదు, ఆ పట్టణం ద్వారా వచ్చే ఆదాయాన్ని శాశ్వతంగా ఆ దేవాలయానికే చెల్లించాలని ఆదేశాలు జారీచేశాడు. అంటే ఆ పట్టణాన్నంతటినీ ఆ దేవాలయం కోసం దత్తం చేశాడు. పూజారులు అక్కడి విగ్రహాలను ట్రావెన్కోర్‌కు తరలించారన్న సంగతి సుల్తాన్ దృష్టికి వచ్చింది. వెంటనే వాటిని తెప్పించి ఆ దేవాలయంలో పునఃప్రతిష్ఠింప జేశాడు. (తారీఖే-సల్తనతేఖుదాదాద్)

# 3. మతం న్యాయానికి అవరోధం కారాదు

భారత దేశంలో నివసించే అరబ్బులకు సంబంధించిన విచిత్రమైన సంఘటనలలో ఒక ఆసక్తికరమయిన ఘటన- ముహమ్మద్ ఔఫీ కథనం ప్రకారం, ఖంభాత్ (గుజరాత్) ఓడరేవు వద్ద- ముహమ్మద్ గజనీ దండయాత్రలకు పూర్వం- చాలా మంది ముస్లిములు నివసించేవారు. వారంతా ధార్మికులు. ఆ సముద్ర తీర ప్రాంతంలో వారొక మస్జిద్‌ని కూడా నిర్మించుకున్నారు. అందులో ఒక ఎత్తయిన మీనార్ కూడా ఉండేది. దానిపైకెక్కి ముఅజ్జిన్ రోజూ ఐదుపూటలా అజాన్ పిలుపు ఇచ్చేవాడు.

ముస్లింల మాదిరిగానే అక్కడ పారసీక వర్గం కూడా నివసించేది. వారు తమ వైఫల్యాల కారణంగా ముస్లింలపై అసూయపడేవారు. మస్జిద్ నుండి ఇవ్వబడే అజాన్ వారికి కర్ణకఠోరంగా ఉండేది. అందుచేత వాళ్లు స్థానిక హిందువులతో కుమ్మక్కై అరబ్బులకు వ్యతిరేకంగా ఉన్నవీ లేనివీ నూరిపోశారు. ఒకరోజు హిందువులు, పారసీకులు కట్టకట్టుకుని అరబ్బులపై దాడి జరిపారు. మస్జిదుకు నిప్పు అంటించారు. మీనార్‌ను నేలమట్టం చేశారు. ముస్లిములను నిర్దాక్షిణ్యంగా వధించారు.

'ఖంభాత్'లో ఆనాడు నహర్‌వాలా ప్రభుత్వం ఉండేది. అక్కడి రాజుకు గుజరాత్ ప్రాంతమంతటిపై పట్టు ఉండేది. జైసింగ్ నహర్‌వాలా అప్పట్లో

పరిపాలకుడుగా ఉన్నాడు. ఆయన ధర్మచక్రవర్తిగా పేరు మోసాడు. ఆ మారణ కాండ నుండి బ్రతికి బయటపడిన వారిలో ఖతీబ్ అలీ ఒకడు. అతడు ఆ మస్జిద్ ఇమామ్ కూడా. అతను అష్టకష్టాలు సహించి నహర్‌వాలా దర్బారు చేరుకున్నాడు. అక్కడి అధికార్లకు తన గోడు వినిపించుకుని ఏడ్చాడు. కాని ఎవరూ అతని గోడును వినిపించుకోలేదు. ఎందుకంటే క్రింది అధికార్లంతా ఒకే మతస్థులు. తమకు వ్యతిరేకంగా ఎలాంటి ఫిర్యాదయినా చక్రవర్తికి అందటం వాళ్లకు సుతరామూ ఇష్టం లేదు. ఖతీబ్ ఎంత మొత్తుకున్నా అతన్ని చక్రవర్తి వరకూ వెళ్లనివ్వలేదు.

నిరాశ చెందిన ఖతీబ్ అలీ ఒకరోజు చక్రవర్తి షికారుకు వెళుతున్నాడన్న సంగతి తెలుసుకుని ముందుగానే అడవికి చేరుకున్నాడు. ఒక పాత వృక్షం చాటున బైఠాయించి, చక్రవర్తి అటురాగానే వెళ్ళి అడ్డుకున్నాడు. ప్రాణాన్ని సయితం లెక్క చేయకుండా, "ఏనుగును ఆపండి. బాధితుని మొరను ఆలకించండి" అంటూ వేడుకున్నాడు. హిందీ భాషలో స్వయంగా వ్రాసిన ఒక విషాద గీతాలాపన చేశాడు. ముస్లింలను ఎలా అమానుషంగా చంపిందీ, మస్జిదును ఎలా దహనం చేసిందీ ఆ గీతాలాపన ద్వారా వ్యక్తమవుతోంది. ఈ సంఘటనను విన్నంతనే చక్రవర్తి ఖతీబ్ అలీని తన ప్రత్యేక సేవకుడికి అప్పజెప్పాడు. "నీవు ఇతన్ని నీ పర్యవేక్షణలో ఉంచు. ఇతనికి కావలసిన వస్తువులను సమకూరుస్తూ ఉండు. నేను ఆజ్ఞాపించినప్పుడు ఇతన్ని నా దర్బారులో హాజరుపరచు" అని చెప్పి చక్రవర్తి వెళ్ళిపోయాడు. ఆ విషాద రచనను కూడా చక్రవర్తి తన వద్దనే ఉంచుకున్నాడు.

షికారు నుండి తిరిగి వచ్చిన తరువాత రాజారామ్ సింగ్ తన మంత్రులందరినీ పిలిపించి, "మూడు రోజుల దాకా నేను ముఖ్యమైన పనిలో నిమగ్నమై ఉంటున్నాను. అందుచేత కొలువు తీరలేను. మూడు రోజుల వరకూ దర్బారు వ్యవహారాలన్నీ మీరే చూసుకోవాలి. ఏ విషయాన్నీ నా దృష్టికి తీసుకురాకండి" అని చెప్పాడు.

ఈ బాధ్యతను మంత్రులకు అప్పజెప్పి అతడు రాజప్రాసాదం లోపలకెళ్ళి పోయాడు. అదే రోజు రాత్రి అతివేగంగా పరుగెత్తే వాహనంపై స్వారీ అయి

నహర్‌వాలా ఖంభాత్ వైపునకు దూసుకుపోసాగాడు. నిరంతరం ప్రయాణం చేసి మరునాడు సాయంత్రానికి 'ఖంభాత్' చేరుకోగలిగాడు. తాను రాజునన్న అనుమానం కలగకుండా ఉండేందుకు మారు వేషంలో వచ్చాడు. పట్టణమంతా సంచరించి, వివిధ వర్గాల వారిని విచారించి రహస్యంగా నిజానిజాలను కను గొన్నాడు. స్వయంగా నేలమట్టమయిన మస్జిదును తనికీ చేసి ఖతీబ్ అలీ చేసిన ఫిర్యాదులో ఎలాంటి అతిశయోక్తి లేదని తెలుసుకున్నాడు. ముస్లింలు ఎలాంటి రెచ్చగొట్టే చర్యకు పూనుకోలేదనీ, వారంతా నిర్దోషులని నిర్ధారించు కున్నాడు.

విచారణ ముగిసిన తరువాత చక్రవర్తి సముద్రతీరానికి వెళ్ళి ఒక కూజా ఉప్పునీళ్లను ముంచుకున్నాడు. అక్కణ్ణుంచి వాయువేగంతో తిరిగివచ్చాడు.

మరునాడు ఉదయం చక్రవర్తి దర్బారుకు వచ్చాడు. మంత్రులు, సలహాదారులందరినీ పిలిపించాడు. అనంతరం ఖతీబ్ అలీని కూడా పిలిపించి, ఫిర్యాదు వినిపించమని ఆజ్ఞాపించాడు. అతడు తన గోడునంతా ఏకరువు పెట్టుకున్న పిదప చక్రవర్తి దర్బారువారి అభిప్రాయం తెలుసుకోగోరాడు. "మహారాజా! ఈ అపరిచిత వ్యక్తి మాటలపై మాకు నమ్మకం కలిగేదెలా? మాకు తెలిసినంత వరకూ ఖంభాత్ ప్రజలు నిర్దయులు కారు. మా దృష్టిలో ఈ వ్యక్తి అసత్యవాది" అని చాలా మంది హిందూ సలహాదారులు అభిప్రాయపడ్డారు. దర్బారీల జవాబు విని చక్రవర్తి తాను నింపుకువచ్చిన కూజాను తెప్పించాడు. అందలి నీళ్ల రుచి చూడమని అందరినీ ఆదేశించాడు. నీళ్ల రుచి చూసిన వారంతా, "మహారాజా! ఇది ఉప్పునీరు" అని సాక్ష్యమిచ్చారు.

అప్పుడు చక్రవర్తి అసలు విషయం చెప్పాడు: "ఇది సముద్రపు నీరు. ఈ వ్యక్తి ఫిర్యాదు విన్నమీదట, మత విభేదం కారణంగా ఇక్కడి వారు ఎవరూ ఇతని వాదనను సమర్థించరని నాకు అనిపించింది. ఇప్పుడు మీరంతా చెబుతున్నట్లే అందరూ ఇతనితో విభేదిస్తారని నాకు ముందే అనుమానం కలిగింది. అందుకే నేను స్వయంగా ఖంభాత్ వెళ్ళాను. అందుకు రుజువుగా ఈ ఉప్పు నీటిని మీ ముందుంచాను. అక్కడ నేను ఒక్కో వ్యక్తిని దర్యాప్తు చేశాను. సంఘటనా స్థలాన్ని సందర్శించాను. అంతా తనిఖీ చేశాను. ఈ వ్యక్తి చెప్పిందంతా

అక్షర సత్యమని గ్రహించాను. నిస్సందేహంగా అక్కడి ముస్లిములపై పెద్ద దౌర్జన్యం జరిగింది."

"నా రాజ్యంలోని ప్రజలంతా నిశ్చింతగా, ప్రశాంతంగా జీవించేలా చూడవలసిన బాధ్యత నాపై ఉంది" అంటూ చక్రవర్తి ఖంభాత్‌కు చెందిన హిందూ పారసీక మతోన్మాదులను పట్టుకుని దండించవలసిందిగా ఆర్డినెన్సును జారీచేశాడు. ముస్లింలు మస్జిదును పునర్నిర్మించుకునేందుకుగాను లక్ష బాలూతర్ (అప్పటి నాణేలు)లను కానుకగా ఇచ్చాడు. ఈ సంఘటన గురించి ఫిర్యాదు చేసిన ఖతీబ్ అలీకి 4 థానుల ప్రత్యేక వస్త్రాన్ని బహూకరించాడు. ఫలితంగా అక్కడ అందమైన, పటిష్టమయిన మస్జిద్ నిర్మించబడింది. చక్రవర్తి ఖతీబ్ అలీకి ఇచ్చిన వస్త్రం అతని జ్ఞాపకార్థం మస్జిదులోనే ఉంచబడింది. పండుగలు, పర్వదినాల సందర్భంగా అది ప్రదర్శించబడేది. మస్జిద్ మరియు మీనార్ కూడా ఈ నిష్పాక్షిక న్యాయానికి ప్రతీకగా చాలా కాలం నిలిచి ఉన్నాయి. అయితే బాలారామ్ సైన్యం నహర్‌వాలాపై దండెత్తి వచ్చినప్పుడు ఇది ధ్వంస మయింది. తదుపరి సయీద్ బిన్ షర్ఫ్ తన స్వంత ఖర్చుతో ఆ మస్జిదును పునర్ నిర్మించాడు. అది ఇప్పటికీ ఉంది. (జవామె ఉల్ హికాయాత్- 6వ అధ్యాయం)

## 4. మరపురాని సంఘటన

ఒక చిన్న సంఘటనను ప్రస్తావించటం సమంజసమనిపిస్తోంది. షమ్సుల్ హుదా అనే న్యాయవాది ఒకరుండేవారు. ముస్లిముల నాయకుడుగా భావించ బడేవారు. ముస్లిం లీగ్ అధ్యక్షులుగా కూడా ఎన్నికయ్యారాయన. యూనివర్శిటీ సెనెట్ మెంబర్‌గా, లెజిస్లేచర్ కౌన్సిల్ అధ్యక్షులుగా కూడా ఎంపికయ్యారు. బెంగాల్ గవర్నరుకు చెందిన ఎగ్జిక్యూటివ్ వ్యవస్థలో మెంబర్‌గా, అనంతరం హైకోర్టు న్యాయమూర్తిగా పదవి పొందారు. ఆయనకు ప్రభుత్వ అవార్డు కూడా లభించింది. అప్పట్లో ఆయన ఖాన్ బహదుర్‌గా పిలువబడ్డారు. హైకోర్టు న్యాయవాదులు, న్యాయమూర్తులు కూడా ఆయన్ని అమితంగా గౌరవించేవారు. ఆయన ప్రాక్టీసు కూడా బావుండేది. మంచి మనస్కులు. ధార్మిక భావాలుగల వారు. ముస్లిం విద్యార్థులకు తన తరఫున స్కాలర్ షిప్పులు ఇస్తూ ఉండేవారు. అప్పట్లో నేను ఆయన వద్దనే ఉండేవాణ్ణి.

బక్రీద్ పండుగ సమీపించింది. ఆ వీధిలో కూడా ముస్లిములదే ఆధిక్యం. బహుశా ఆయన ఇంట్లో పండుగనాడు ఆవు ఖుర్బానీ ఇవ్వబడుతుందేమోనని నాకు అనుమానం వచ్చింది. నేనేమో సనాతన హిందువుని. కొన్నాళ్ళపాటు ఎక్కడికయినా వెళితే బావుంటుందని నాకనిపించింది. చెప్పాపెట్టకుండా నేను నా మిత్రుల వద్దకు వెళ్ళిపోయాను. నాలుగు రోజుల తరువాత తిరిగివచ్చాను. మీరెక్కడికెళ్ళి పోయారు? అని ఆయన అడగనే అడిగారు. సూటిగా సమాధానం ఇవ్వలేకపోయాను. నా కర్థమయిందిలెండి. బక్రీద్ పండుగ అని మీరు వెళ్ళిపోయారు కదూ?! ఇక్కడ ఆవు ఖుర్బానీ ఇవ్వబడుతుందనీ, దానికి తట్టుకోలేనని తలపోసి వెళ్ళిపోయారు మీరు. ఇలా చేసి మీరు నాకు అన్యాయం చెయ్యలేదా? మీ భావాలు, భావోద్రేకాలను ఆ మాత్రం కూడా ఖాతరు చేయనని ఎలా అనుకున్నారు? మీరొక్కరేకాదు, నా ఇంట్లో అనేకమంది సేవకులు హిందువులూ ఉన్నారు. ఇక్కడి తోటమాలి హిందువు. గోవుల కాపలాదారు హిందువే. వీళ్ళందరి మత భావాలను నేను లెక్కచేయననుకున్నారా? మాటమాత్రంగా నన్నడిగి ఉంటే బావుండేది. మా ఇంట్లో వున్న సేవకుల మనోభావాలకు గాయం కలగరాదన్న ఉద్దేశ్యంతో మేము ఎన్నడూ ఆవు ఖుర్బానీ ఇవ్వము- ఇది విని నేను అవాక్కయ్యాను.

-డా. రాజేంద్రప్రసాద్, భారత మాజీ రాష్ట్రపతి (స్వీయగాథ-పేజీ:132)

## 5. ముసల్మాను భుజంపై బ్రాహ్మణుని శవం

రెండవ ప్రపంచ మహా సంగ్రామం కాలంలో జరిగిన సంఘటన. నేను స్వయంగా చూసిన సంఘటన. భోపాల్‌లోని జనరల్ ఆసుపత్రిలో ఒక హిందూ బ్రాహ్మణుడు చనిపోయాడు. ఇతను భైల్సా వాస్తవ్యుడు. అక్కడి పహిల్వాను మాత్రమేకాదు, బాగా పలుకుబడి వున్న వ్యక్తి కూడాను. ఈ పహిల్వాను వ్యాధిగ్రస్తుడై చికిత్స నిమిత్తం భోపాల్ ఆసుపత్రికి వచ్చాడు. కాని రోగం ముదిరి మృత్యువాతన పడ్డాడు. మరణ సమయంలో అతని దగ్గర ఒక శిష్యుడు తప్ప అయినవారు ఎవరూ లేరు.

భోపాల్ నుండి భైల్సా వెళ్ళాలంటే 40 మైళ్ళు ప్రయాణించాలి. భౌతికకాయాన్ని అంతదూరం తరలించేందుకు (ఆనాడు) తగినన్ని సౌకర్యాలు

లేవు. కనీసం అతని అంత్యక్రియలకు అతని ఆత్మీయులు కూడా భోపాల్‌కు రాలేని స్థితి. ఎండలు మండుతున్నాయి. భౌతికకాయాన్ని ఎక్కువ సేపు ఉంచటం భావ్యం కూడా కాదు. భోపాల్ ఆసుపత్రిలోని అనాధల శవాలను భంగీల (పాకీ పనిచేసేవారు) ద్వారా ఖబరస్తాన్ లేక శ్మశాన వాటికలకు తరలించడానికి మునిసిపాలిటీ వారి తరఫున ఏర్పాట్లు ఉండేవి.

ఆనవాయితీ ప్రకారం ఈ హిందూ శవం పట్ల కూడా అదే వ్యవహారం జరిగేది. కాని ఆ మృతుని శిష్యుడు తీవ్రంగా కలతచెందాడు. ఘనత వహించిన తన గురువుగారి శవాన్ని 'అంటరానివారి'కి అప్పజెప్పేదెలా? అన్నది అతని బాధ. స్థానిక హైందవ సంస్థల వద్దకు వెళ్ళి తన గోడు వినిపించుకున్నాడు. కాని అక్కడతనికి నిరాశే ఎదురయ్యింది. బాధాతప్తహృదయంతో ముస్లింల సహాయం కోరాడు. అక్కడా లాభం లేకపోయింది. అయితే నవయువకుడైన ఈ శిష్యుని నిస్సహాయస్థితిని చూసిన కొంతమంది ముస్లింలు హైందవ సంస్థల్ని, కార్యకర్తల్ని ఒప్పించే ఉద్దేశ్యంతో వెళ్ళి బ్రతిమాలారు. ఎంత చెప్పినా వినకపోవ టంతో ఆ మృతుని శిష్యుడు భోరున ఏడ్వసాగాడు.

గత్యంతరంలేని పరిస్థితిలో ముస్లిం యువకులు కొందరు ఈ సేవకు సిద్ధమయ్యారు. ఛాందసుడైన బ్రాహ్మణుని దృష్టిలో ముస్లింలు కూడా అంటరాని వారికి తక్కువేమీకారు. అయితే ముస్లింల ఈ స్వచ్ఛంద సేవను ఆ యువకుడు కొంతలోకొంత నయంగా తలపోశాడు. వారంతా కలసి ఈ బ్రాహ్మణ భౌతిక కాయాన్ని సకల లాంఛనాలతో ఎత్తుకుని శ్మశాన వాటిక వైపునకు సాగిపోయారు. దారిలో- ఏ వీధి గుండా ఈ శవయాత్ర సాగినా అక్కడి హిందూ దుకాణదారులు సిగ్గుతో తలుపులు మూసుకోసాగారు. ముస్లిములు ఆశ్చర్యంతో నోళ్ళు తెరచి చూడసాగారు. ముస్లింల భుజస్కంధాలపై ఉన్న ఆ భౌతికకాయం ఎవరిదా?! అన్నదే వారి ఆశ్చర్యానికి కారణమని వేరుగా చెప్పనక్కరలేదు.

ఈ శవయాత్ర శ్మశాన వాటిక వైపునకు సాగిపోతుండగా అస్ర్ నమాజ్ వేళయింది. అజాన్ పిలుపు వినవచ్చింది. ముస్లిం యువకులు పాడెను దించి మృతుని శిష్యుడ్ని కాపలాగా పెట్టి, నమాజ్ కోసం వెళ్ళారు. వారు నమాజ్ చేసి తిరిగొచ్చేసరికి, ఇంచుమించు నూటయాభైమంది హిందువులు పాడె వద్ద

గుమిగూడి ఉన్నారు. ఆ గుంపులో నుంచి ఒక వ్యక్తి ముందుకు వచ్చి ఎంతో మర్యాదపూర్వకంగా ప్రశ్నించాడు: 'ఏమండీ, ఈ పాడెను ఎత్తే భాగ్యం మాకు కూడా దక్కగలదా?' అని.

ఆ తరువాతి వృత్తాంతం చాలా సుదీర్ఘమయింది... అయితే ఒక విషయం మాత్రం మీకు చెప్పాలి. ఆ బ్రాహ్మణ పహిల్వాను మరెవరో కాదు రాష్ట్రీయ స్వయం సేవక్ (ఆర్.ఎస్.ఎస్.)లో పేరుమోసిన కార్యకర్త. ఈ సంఘటన ప్రభావం అతని శిష్యులపై ఎంతగా పడిందంటే చాలా కాలం వరకు వారు ముస్లింల సహాయ సహకారాలకు ముందుకువచ్చేవారు.

ఇలాంటిదే మరో సంఘటన గురించి మా మద్రాసు మిత్రులు చెప్పారు. అక్కడ వందిలాసల్ అనే ఒక పుణ్యక్షేత్రం ఉందట. అక్కడ ఒకసారి కలరా వ్యాధి తీవ్రంగా సోకింది. మద్రాస్ వేలూర్‌లకు చెందిన కొంతమంది ముస్లిములు అక్కడికెళ్ళి చికిత్సా శిబిరం నెలకొల్పారు. దీక్షతో వైద్యసేవలు అందించారు. అక్కడ కుళ్ళి కంపుకొడుతున్న మృతదేహాలను కాల్చారు. ఇళ్లను శుభ్రపర్చారు. పట్టణం వెలుపల ఒక ప్రత్యేక ప్రహరీని నిర్మించి రోగులను ఆ స్థలానికి తరలించారు. కలరా వ్యాధి తగ్గుముఖం పట్టాక అక్కడి దేవాలయానికి చెందిన ప్రధాన పూజారి వారందరినీ దేవాలయంలోకి పిలుచుకువెళ్ళి ఎంతో మర్యాదతో కూర్చోబెట్టాడు. వారినుద్దేశించి పూజారి అన్నమాటలివి: "దేవతలు ఏ పురములోనయినా ప్రవేశిస్తే అక్కడి విపత్తులు తొలగిపోతాయని గ్రంథాలలో వ్రాసి ఉంది........ మీరు కూడా దేవతల్లాంటివారే."

(దావత్ ఢిల్లీ- 'సిద్ఖె జదీద్' సౌజన్యంతో, 12-1-1962)

## 6. మైనారిటీలపై మమకారం

(హాజీ వదూద్ అలీ ఖాన్ ఆఫ్ కైలాష్‌పూర్ నోట)

1947లో జరిగిన మతకలహాలను తలచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తుంది. ముఖ్యంగా పల్లె ప్రాంతాల ప్రజల్లో తీవ్రమయిన భద్రతారాహిత్య భావనని పుట్టించాయి. ముస్లింలు అధికంగా నివసించే గ్రామమయితే అక్కడి హిందువులు భయభ్రాంతులకులోనై ఉండేవారు. హిందువులు అధికంగా నివసించే గ్రామం లోని ముస్లింలు కలవరానికిలోనై ఉండేవారు. అప్పట్లో సహారన్‌పూర్‌లో

జరిగిన మతకలహం గ్రామీణ ప్రాంతాల ప్రజల్లో గగుర్పాటును కలిగించింది. ఎప్పుడు ఎక్కడ ఏం జరుగుతుందోనన్న ఆందోళన! రాత్రిపూట కంటినిండా నిద్రపోయేవారు కాదు. కొంతమందిని రాత్రివేళల్లో ఊరికి కాపలా పెట్టేవారు. కైలాష్‌పూర్‌కు కొద్దిదూరంలో ఖజూరీ అక్బీర్‌పూర్ అనే ఒక గ్రామముంది. అక్కడి హిందువులంతా గుజ్జార్ కులస్థులు. అక్కడ కొంతమంది కూలీనాలీ చేసుకునే ముస్లింలు కూడా ఉన్నారు. పరిస్థితుల స్వరూపం సంక్లిష్టంగా రూపుదాల్చటంతో ఆ గ్రామంలోని కార్మిక ముస్లింలంతా కూడబలుక్కుని సమీపంలోనున్న కైలాష్‌పూర్‌కు తరలిపోవాలని నిశ్చయించుకున్నారు. ఆందోళన చెందవలసిన అవసరం ఎంతమాత్రం లేదనీ, తమ తరఫున ఎలాంటి కీడు వాటిల్లబోదని గ్రామపెద్దలైన హిందువులు అభయమిచ్చారు.

కాని పరిస్థితులు మాత్రం భయానకంగా ఉన్నాయి. ఎంతగా సర్దిచెప్పుకున్నా వారి అంతరాత్మ సంతృప్తి చెందటం లేదు. ఏ క్షణంలో ఏమవుతుందోనన్న భయం వాళ్లని పట్టిపీడిస్తోంది. ఎట్టకేలకు ఒకరోజు రాత్రి చీకట్లో ఆ మైనారిటీ కుటుంబాలన్నీ గుట్టుచప్పుడుకాకుండా ఆ ఊరి నుంచి ప్రస్థానం చేసి దగ్గర్లోనున్న కైలాష్‌పూర్ చేరుకున్నాయి. ముస్లింలు వెళ్ళిపోయారన్న సంగతి గ్రామస్థులకు కొద్దిసేపట్లోనే తెలిసిపోయింది.

గ్రామపెద్దలలో ఒకరైన జీవన్‌సింగ్‌కు కూడా ఈ సంగతి తెలియగానే ఆయన బిగ్గరగా ఏడ్చేశాడు. ఆర్తనాదాలు చేస్తూ గ్రామస్థులనందరినీ సమావేశపర్చాడు. ఇప్పుడు మేమేం చేసేది? లోకానికి ఎలా మొహం చూపేది? మనవల్ల రక్షణలేదని భావించి కొద్దిమంది ముస్లింలు ఊరు వదలిపోయారని చెప్పుకుంటే ఎంత సిగ్గుచేటు? ఎట్టకేలకు ఆ వృద్ధుడు తిరుగులేని విధంగా శాసించాడు:

"ఈ రాత్రికి రాత్రే వాళ్ళని వెనక్కి రప్పించండి. లేకుంటే నా పరువు పోతుంది. గ్రామస్థుల పరువు మంటగలసిపోతుంది. ఈ రాత్రే వాళ్లు తిరిగి రావాలి సుమా!" జీవన్‌సింగ్ వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. ఆయన్ని శాంతింప జేయటం ఎవరి తరమూ కావటం లేదు. ఆ మైనారిటీలను వాపసు తీసుకువచ్చే ఉద్దేశ్యంతో కొంతమంది యువకులు కైలాష్‌పూర్‌కు బయలుదేరారు. గుఱ్ఱాలపై

వస్తున్న జనాన్ని చూసి కైలాష్‌పూర్ పొలిమేరల్లో పహరాకాస్తున్న ముస్లింలు అప్రమత్తులై పోయారు. కాని తొందరగానే వారికి విషయం అవగతమయింది. కైలాష్‌పూర్‌లోకి ప్రవేశించగానే వాళ్లు "తమ మనుషులను" వెతకసాగారు. తిరిగి రమ్మని ప్రాధేయపడ్డారు. భయాందోళనలకు గురైవున్న ముస్లింలు వాపసు వెళ్ళడానికి ససేమిరా అంటున్నారు.

ఎంత చెప్పినా వినకపోవటంతో ఆఖరికి ఆ యువకులు అమీర్‌ఖాన్ బహదుర్ హాజీ మక్సూద్ అలీఖాన్ మర్హూమ్‌ను, ఆయన కుమారులను ప్రాధేయపడ్డారు. తమ వూరి ముస్లింలను తమవెంట పంపమని బ్రతిమాలారు. అమీర్‌ఖాన్ కుటుంబీకులు నచ్చజెప్పిన మీదట ఆ కార్మిక ముస్లింలు ఖజూరీ అక్బీర్‌పూర్‌కి తిరిగివెళ్ళారు.

జీవన్‌సింగ్ పరువు నిలిచింది. పరిస్థితులు సామాన్య స్థితికి వచ్చేవరకూ గ్రామంలోని హిందువులంతా ఆ మైనారిటీలను కంటికిరెప్పలా కాపాడుకున్నారు.

(బేబాక్ వారపత్రిక, సహరన్‌పూర్- 1961 సంచిక నుండి)

## 7. కన్వర్ సింగ్ బొందిలో ప్రాణమున్నంత వరకు

దేశ విభజన జరిగినప్పటి సంఘటన. డెహ్రాడూన్‌లోని ఒక మస్జిద్‌ని పడగొట్టేందుకు దండెత్తి వచ్చింది దుండగీల ఒక ముఠా. అక్కడి ముస్లింలంతా భయపడి నోరెత్తలేకపోయారు. మస్జిదు పక్కనే లాలా కన్వర్ సింగ్ అనే ఒక హిందువు శ్రీమంతుడు నివసించేవారు. దుండగులు దండెత్తి వచ్చారని తెలియగానే కన్వర్ సింగ్ పరుగెత్తుకు వచ్చి మస్జిద్ ద్వారం వద్ద నిలబడ్డారు.

"కన్వర్ సింగ్ బొందిలో ప్రాణమున్నంత వరకూ ఎవ్వడూ ఈ మస్జిదుకు ఏమాత్రం హాని తలపెట్టలేడు" అంటూ ఎలుగెత్తి చాటారాయన. తక్షణం తన కొడుకులను కూడా పిలువనంపాడు. పరిస్థితిని అర్థం చేసుకున్న అల్లరిమూక తోకముడిచింది. మరింక వారు మస్జిద్ జోలికి రాలేదు.

పరిసరాలలోని ఉద్రిక్తతను పసిగట్టిన కన్వర్ సింగ్ చుట్టుపట్ల ఉన్న ముస్లిములను, సామానులు గట్రా సర్దుకుని తన ఇంటికి వచ్చేయమని సలహా ఇచ్చాడు.

18 మంది లాలాజీ ఇంటికి శరణార్థులుగా వచ్చారు. మూడు మాసాల వరకు వారు లాలా కన్వర్ సింగ్ ఇంట్లోనే ఉన్నారు. అంతకాలం వారి పోషణకయ్యే ఖర్చుల్ని లాలాజీయే భరించారు. ఢిల్లీలో ఉద్రిక్తత సడలి పరిస్థితులు కుదుట పడిన తరువాత ముస్లింలు తమ తమ ఇండ్లకు వెళ్ళిపోయారు. మూడు మాసాల దాకా మస్జిద్ నిర్వహణకయ్యే ఖర్చులు కూడా కన్వర్ సింగ్ స్వయంగా భరించారు. అంతేకాదు నియమబద్ధంగా ప్రతి రోజూ ఐదు పూటలు అజాన్ ఇవ్వమని 'ముఅజ్జిన్'కు తాకీదు చేశారు.

(హఖీఖత్ దినపత్రిక, లక్నో సౌజన్యంతో)

## 8. మస్జిద్-మందిర్ల వివాదం, ఒక ముస్లిం ప్రముఖుని సత్యవాక్కు

1857 సిపాయిల తిరుగుబాటుకు కొన్ని రోజుల ముందు జరిగిన సంఘటన- సహారన్‌పూర్ జిల్లాలోని అన్‌బేతా గ్రామంలో హిందూ-ముస్లింల మధ్య వివాదం మొదలయింది. ఒకానొక భూభాగానికి సంబంధించి మొదలయిన ఈ గొడవ చిలికి చిలికి గాలివానగా మారినట్టు పెద్ద దుమారమే రేపింది. ఆ భూభాగం మస్జిద్‌కి సంబంధించినది అని ముస్లింలు దావా చేయగా, కాదు అది ఒక మఠానికి చెందినదని హిందువులు వాదించారు. వ్యవహారం కోర్టుదాకా వెళ్ళింది. ఆ కాలంలో కేసులను జిల్లా కలెక్టర్ విచారించి తీర్పు ఇచ్చేవాడు. కలెక్టర్ కోర్టులో కేసు నడుస్తోంది. ఇరువర్గాలవారు తమ తమ వాదనలకు అనుకూలంగా అవసరమయిన ఆధారాలను సమకూరుస్తున్నారు. ఎట్టకేలకు హిందువుల తరఫున ఒక నిర్ణయాత్మకమయిన ప్రతిపాదన వచ్చింది. తమ గ్రామంలో సయ్యద్ సాలార్ బక్ష్ అనే ఒక ముస్లిం పెద్ద మనిషి ఉన్నారనీ, కావాలనుకుంటే ఆయన సాక్ష్యం తీసుకోవచ్చనీ, ఒకవేళ అది మస్జిదేనని ఆయన అంటే తమకు వ్యతిరేకంగా డిక్రీ జారీ చేయవచ్చనీ

హిందూ సోదరులు చెప్పారు. కలెక్టర్ ఈ ప్రతిపాదనను ఆమోదించాడు. ముస్లింలు కూడా దీనికి ఆమోదించక తప్పలేదు.

న్యాయస్థానానికి రమ్మని సయ్యద్ సాహెబ్‌కు కబురందంది. అయితే సయ్యద్ సాహెబ్ అభిమానధనుడు. తెల్లదొరలంటే ఆయనకు ఏమాత్రం పడదు. ఆంగ్లేయుల ముఖం చూడటానికి కూడా ఆయన ఇష్టపడేవారు కాదు. ఈ కారణంగా ఆయన కోర్టుకు రావటానికి నిరాకరించారు.

ఆంగ్లేయుడైన ఆ కలెక్టర్ కూడా చాలా ఉదారస్వభావుడు. తనకు, తన న్యాయస్థానానికి ఇంత పరాభవం జరిగినప్పటికీ, తీవ్రంగా పరిగణించలేదు; మరోసారి సయ్యద్ సాహెబ్‌కు కబురంపాడు- న్యాయస్థానానికి వచ్చి సాక్ష్యం ఇవ్వమని! ఎట్టకేలకు సయ్యద్ సాహెబ్ తన సాక్ష్యానికున్న ప్రాముఖ్యతను అర్థం చేసుకుని అందుకు సిద్ధమయ్యారు.

అయితే ఆంగ్లేయుని పట్ల ఆయనలో తిష్ఠవేసివున్న విముఖత మాత్రం అలాగే ఉంది. న్యాయస్థానానికయితే ఆయన వచ్చారుగాని కలెక్టర్‌పై తన దృష్టిపడకుండా ఉండేలా వెనక్కి తిరిగి నిలుచున్నారు. ఆయన ధోరణిపై కలెక్టర్ మండిపడలేదు సరికదా, ఎంతో మర్యాదగా ప్రశ్నలు అడిగి కేసును విచారించాడు. వివాదాస్పదమయిన భూభాగం మస్జిదుకు చెందినదా? హిందువుల మతానికి చెందినదా? అని కలెక్టర్ ప్రశ్నించాడు.

"ముస్లిములు చెప్పేది అబద్ధం. అది మస్జిద్ స్థలం కానే కాదు. హిందువుల మతానికి సంబంధించినది" ముఖం అటు త్రిప్పుకునే జవాబిచ్చాడు ఆ పెద్ద మనిషి. ఈ సమాధానం ఇచ్చిన మరుక్షణమే ఆయన న్యాయస్థానం నుండి నిష్క్రమించారు. హిందువులకు అనుకూలంగా తీర్పు వెలువడింది.

('బేబాక్' దినపత్రిక, సహారన్ పూర్-1962)

## 9. ప్రతిభకు ప్రోత్సాహం

1882 ఆగస్టు 3వ తేదీ నాటి విషయం- ప్రముఖ మేధావి, విద్యా విషయిక నిపుణుడు సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్ అలీగఢ్ కళాశాల ఆంగ్ల ప్రిన్సిపాల్‌కు వ్రాసిన లేఖలో ఇలా తెలిపారు:

"అమృత్‌సర్‌కు చెందిన ముస్లిములు కొందరు ప్రతి సంవత్సరం బి.ఏ.లో మన కాలేజీలో అత్యధిక మార్కు సాధించిన ముస్లిం విద్యార్థికి బంగారు పతకం బహూకరించాలని నిర్ణయించుకున్న సంగతి మీకు తెలుసనుకుంటాను. ఇప్పుడు నా నిర్ణయాన్ని కూడా తెలియజేస్తున్నాను- మన కాలేజీలో ప్రతి యేట బి.ఏ.లో ఎక్కువ మార్కులు సంపాదించిన హిందూ విద్యార్థికి నా తరఫున ఒక బంగారు పతకం ఇవ్వదలచాను. మీరు ఈ విషయాన్ని బి.ఏ. విద్యార్థులందరికీ నోటిసు ద్వారా తెలియజేయగలరు."

-ఫిక్ర్-ఓ-నజర్. అలీగఢ్ జులై 1964, 87వ ఉత్తరం, పేజీ:286)

## 10. పేరు కోసం

ఖలీఫా ముహమ్మద్ హుసైన్ ఎన్నదగిన రచయిత. ఆయన 'పాటియాల చరిత్ర' అనే పుస్తకం ఒకటి రచించారు. అందులో ఒక చోట ఇలా రాశారు:

జార్జ్ ఫ్రెడరిక్ లేర్‌క్సన్ అనే అంబాలా కమిషనర్ అంబాలాలో పర్యటించిన తరువాత పాటియాలాకు కూడా వచ్చారు. పాటియాలా రాజు కమిషనర్‌ను సాదారంగా ఆహ్వానించారు. ఇద్దరూ ఏనుగునెక్కి కోటలోకి ప్రవేశించారు. ఆ కోటలో నవాబ్ సైఫ్‌ఖాన్ కట్టించిన మస్జిద్ ఒకటి ఉండేది. అది రాజ భవనానికి ఎదురుగా ఉండేది. మస్జిద్‌ను చూసిన ఆ ఆంగ్ల కమిషనర్ రాజుతో "ఔరంగజేబు చక్రవర్తి హిందువుల దేవాలయాలను పడగొట్టాడు కదా!* మరి మీరు ఈ మస్జిద్‌ను మీ ప్రాసాదానికి ముందరే ఎందుకు ఉండనిచ్చారు?" అనడిగాడు.

దానికి రాజు ఇచ్చిన సమాధానం, "ఈ క్షణాన మీరు ఔరంజేబు పేరును ఏ రీతిలో పలికారో అదే రీతిలో భావితరాలు నా పేరును స్మరించడం నాకిష్టం లేదు." (తారిఖ్ రియాసత్ పాటియాల, పేజీ:465)

---

★ సదరు కమిషనర్ గారి మాట తప్పు. నేడు చరిత్రకారులందరూ, హిందువులు సయితం, దీన్ని బలంగా త్రోసిపుచ్చారు. (సం.)

## 11. అనాలోచిత చర్య

ఫారసీలో 'ఇమాదుస్సాదత్' అనే చరిత్ర గ్రంథం ఒకటుంది. అందులో ఇలా వ్రాయబడింది:

ప్రసిద్ధ మరాఠా సర్దార్ ఒకసారి ఢిల్లీ వెళుతూ మార్గమధ్యంలో - మథురలో బస చేశాడు. మథురానగరిలో అబ్దున్నబీ ఖాన్ అనే వ్యక్తి కట్టించిన మస్జిద్ ఒకటి ఉండేది. దాన్ని చూసి మరాఠా సర్దార్ భావ్‌జీ భరత్‌పూర్ రాజయిన సూరజ్‌మల్ జాట్‌ని ఉద్దేశించి, "నీవు హిందూ రాజ్యానికి రాజువై ఉండి కూడా ఈ మస్జిద్‌ను పడగొట్టవేమిటి?" అని ప్రశ్నించాడు. ఆ కాలంలో మథురానగరి సురజ్‌మల్ రాజ్య పరిధిలోనే ఉండేది.

మరాఠా సర్దారు ప్రశ్నకు సూరజ్‌మల్ జాట్ ఇచ్చిన సమాధానం చరిత్రాత్మకమయినది. ఆయనిలా అన్నాడు:

"భారత దేశ రాజ్యం పరిస్థితి వేశ్యల్లా మారింది. అది ఈ రోజు ఒకడి ఒడిలోకి పోతే, రేపు మరో వ్యక్తి బాహువుల్లోకి పోయేటట్టుంది. ఈ దేశం మరొకరి అధీనంలోకి వెళ్ళకుండా ఉంటుందన్న నమ్మకమే ఉంటే ఈ మస్జిద్‌ను నేలమట్టం చేసి నామరూపాలు లేకుండా చేసేవాడ్నే, కాని ప్రయోజనం ఏమిటి? ఈ రోజు నేను ఈ మస్జిద్‌ను నేలమట్టం చేస్తే, రేపటి రోజున ఈ రాజ్యం ఎవరో ఒక ముస్లిం రాజు అధీనమవుతుంది. అప్పుడు ఈ మస్జిద్‌కు జరిగిన అన్యాయానికి ప్రతీకారంగా ఆ రాజు ఇక్కడి పెద్ద పెద్ద దేవాలయాలను పడగొట్టి ఒక మస్జిద్‌కు బదులు నాలుగు మస్జిద్‌లు నిర్మించుకుంటాడు. కనుక నేనలాంటి అనాలోచిత పనికి ఒడిగట్టదలచుకోలేదు."

-'ఇమాదుస్సాదత్' పేజీ:78

## 12. మరణించి కూడా ఇక్కడే...!

ఇక్కడ ఇరువర్గాల గురించి ఒక విషయం చెప్పదలిచాను. ఇరువురి దృక్పథాలలో చాలా పెద్ద వ్యత్యాసం ఉంది. ముస్లింలు భారతదేశానికి ఎలా వచ్చినా, ఏ విధంగా వారి జనాభా పెరిగినా, నేడు వారు హిందువుల వలెనే భారత పౌరులన్నది యదార్థం. వాళ్లకంటూ మరో దేశం లేదు. మరో దేశానికి

చెందిన ముస్లిముల యెడల వారికెంతటి సానుభూతి ఉన్నప్పటికీ ఈ దేశం లోనే వారు మరణించవలసి ఉంది. ఇక్కడి సుఖదుఃఖాలను, ఇక్కడి తియ్యని కలలను, చేదు అనుభవాలను వారు చవిచూడక తప్పదు. చనిపోయిన పిదప కూడా వాళ్లు ఇక్కడి భూమిలోని కొంత భాగాన్ని ఆక్రమిస్తూ ఉంటారు. ఒక హిందువు చనిపోయిన తరువాత కాల్చబడతాడు. పంచభూతాలలో శరీరం ఉనికిని కోల్పోతుంది. మిగిలిన కొద్ది బూడిదను కూడా గాలి ఎగరేసుకు పోతుంది. నీరు తనలో కలిపేసుకుంటుంది. కాని ముస్లిం అలాకాదు. అతడు రెండు గజాల నేలను సంపాదించి ఇక్కడే పడి ఉంటాడు; ఎక్కడికీ పోడు. గోరీల గురించి జరుగుతున్న వివాదాలు ఎవరికి తెలియవు గనక? అందుకే-ముస్లింలను ఈ దేశంలో పరాయివారుగా తలపోయటం మానుకోవాలి.

మరి ముస్లింలు పరాయి వారు కానప్పుడు, మరొకరికి ఈ దేశంతోవున్న అనుబంధమే ముస్లింలకు కూడా ఉంది కదా! అన్న ప్రశ్న ఇక్కడ ఉత్పన్నమవుతుంది. అందుచేత వారికి ఇక్కడి వస్తువులన్నీ లభ్యం కావాలి. రాజకీయాధికారాల పంపిణీలో కూడా వారి వాటా కాదనలేనిది. దీనిని నిరాకరించటం వెనుక ఏదైనా పరమార్థం ఉంటే ఆ పరమార్థం ఒక్కటే అయి ఉంటుంది. అదేమంటే వాళ్లని అణచివేసి వారి హక్కులు వారికి దక్కకుండా చేయటం! -డా. రాజేంద్రప్రసాద్, భారత మాజీ రాష్ట్రపతి (స్వీయగాథ-పేజీ:280)

## 13. నిజాయితీకి నికషోపలం

భారత దేశ చరిత్రను అధ్యయనం చేసినవారికి హసన్ గంగూ పేరు తెలియనిది కాదు. ఇతడు దక్కన్‌కు చెందిన సుప్రసిద్ధ పరిపాలకుడు. ఇతడు బహమనీ కాలంలో ఎన్నో ఒడిదుడుకులకు లోనయ్యాడు. గొప్పింటి బిడ్డ అయినప్పటికీ తన కుటుంబం చితికిపోవటంతో బ్రతుకుతెరువు కోసం ఢిల్లీ వెళ్లాలని నిశ్చయించుకున్నాడు. రాజదర్బారులో పలుకుబడి సంపాదించి పైకి రావాలనుకున్నాడు. అనేక రోజులపాటు ప్రయాణం చేసిన మీదట ఒకనాడు తెల్లవారుజామున ఢిల్లీలోని యమునా నదీతీరానికి చేరుకున్నాడు. నదిలో ప్రవహించే స్వచ్ఛమయిన నీటితో ముఖం కడుక్కుని, వుజూ చేసి ఉదయం

నమాజ్ చేసుకున్నాడు. దైవానికి కృతజ్ఞతలర్పిస్తూ శిరస్సును నేలకు ఆనించాడు. సుదీర్ఘ ప్రయాణం చేసి, అలసిసొలసి ఉన్న హసన్‌కు ఇట్టే నిద్రపట్టేసింది. సూర్యోదయం అయ్యేవరకూ నిదురిస్తూనే ఉన్నాడు. అదే సమయంలో ఒక హైందవ జ్యోతిష్య పండితుడు అలవాటు ప్రకారం యమునా తీరానికి స్నానం చేయడానికి వచ్చాడు. అందమయిన నవయువకుడు నిద్రపోవటం గమనించి అతని దగ్గరకొచ్చాడు. వాత్సల్యంతో హసన్‌ను మేల్కొలిపాడు. 'ఎక్కడి నుంచి వచ్చావు నాయనా?' అని ప్రేమతో ప్రశ్నించాడు. 'ఫకీరు ఎక్కడున్నా చీకటి పడగానే అక్కడే సత్రం చేసుకుంటాడు' అంటూ హసన్ వేదాంత ధోరణిలో సమాధానం ఇచ్చాడు. 'ప్రస్తుతానికి నీవు నా అతిథివి' అంటూ గంగూ పండితుడు అతణ్ణి తన ఇంటికి పిలుచుకువెళ్ళాడు. మాసిన బట్టలు, చెదరిన జుత్తుతో దయనీయంగా ఉంది హసన్ పరిస్థితి. పండితునివంక కృతజ్ఞత నిండిన దృష్టితో చూస్తూ ఒప్పుకున్నాడు. స్నానం చేశాక హసన్‌ను వెంటబెట్టుకుని వెళ్ళాడు గంగూ. అతిథి మర్యాదలు చేశాడు. ఏ లోటూ లేకుండా ప్రేమతో చూసుకున్నాడు.

హసన్ కూడా పండితుని పట్ల ఎంతో గౌరవంగా, నిజాయితీగా మసలుకున్నాడు. పనీపాటా లేకుండా కాలక్షేపం చేయటం సముచితం కాదనుకుని పండితుని పొలాల్లో పని చేయసాగాడు హసన్. ఒకరోజు పొలం దున్నుతుండగా నాగలికి ఒక బిందె అడ్డు తగిలింది. దాన్ని వెలికితీస్తే అది ఖరీదైన నాణేలతో నిండి ఉంది.

పొద్దుగ్రుంకిన తరువాత ఆ నిధిని ఇంటికి తెచ్చి యధాతథంగా పండితునికి అప్పగించాడు. హసన్ నిజాయితీని చూసి పండితుడు ఆశ్చర్య పోయాడు. ఆ అబ్బాయిని సుల్తాన్ ముహమ్మద్ బిన్ తుగ్లక్ దర్బారుకు పిలుచుకుపోయి పరిచయం చేయించాడు. సుల్తాన్ ఆ అబ్బాయికి ఒక పదవిని కట్టబెట్టాడు. అలా అంచెలంచెలుగా ఎదుగుతూ దక్కన్ పరిపాలకు డయ్యాడు హసన్.

హసన్ ఎంత ఉన్నతికి చేరుకున్నప్పటికీ తన ప్రప్రథమ మహోపకారి అయిన పండితుణ్ణి మరువలేదు. ఆయన జ్ఞాపకార్థం తన పేరుతో 'గంగూ' అనే నామాన్ని కూడా జోడించుకున్నాడు. ఆ విధంగా హసన్ కాస్తా 'హసన్ గంగూ' అయ్యాడు.

# 14. దీపస్థంభాలు

మేము లాహోర్ వీధుల గుండా పయనిస్తున్నప్పుడు ఇరవయ్యేసిమంది మా చుట్టూ మూగేవారు. వారంతా ముస్లిములే. వారిలో పురుషులు, స్త్రీలు, పిల్లలు, వృద్ధులు- అన్ని వయస్సుల వారుండేవారు. లాహోర్‌లో ఏమేమి జరిగిందో వారంతా మనసు విప్పి మాతో చెప్పేవారు. కొన్నాళ్ళ క్రితం లాహోర్ యూనివర్శిటీకి చెందిన ఒక ముస్లిం ప్రొఫెసర్ మమ్మల్ని కలుసుకొని, "నగరానికి సమీపంలో 40 మంది వ్యక్తులున్నారు. వారందరూ తమ సోదరులతో కలసి నివసించడానికే ఇష్టపడతున్నార"ని చెప్పారు. నగరమంతా సంచరించిన తరువాత మాకు బోధపడింది- ఈ రకంగా ఆలోచించే సోదరుల సంఖ్య ఎక్కువే ఉందని. ఇదే రకమయిన పరిస్థితి మాకు ముస్లింలు అధికంగా నివసించే పశ్చిమ పంజాబ్‌లోనూ, హిందువులు ఎక్కువగా నివసించే తూర్పు పంజాబ్‌లోనూ కానవచ్చింది.

పాకిస్తాన్‌లోని ముస్లింలలో అత్యధిక శాతం ప్రజలు మత కలహాలను ఇష్టపడరనేది, వారు ఇతర వర్గాల సోదరులతో శాంతియుత సహజీవనాన్నే కాంక్షిస్తున్నారనేది నిర్వివాదాంశం. మారణకాండ, విధ్వంసకాండలో పాల్గొన్నవారు ఒక్క శాతం కంటే ఎక్కువ ఉండరనేది నా నమ్మకం. అయితే ప్రజా జీవనాన్ని సంకటంలో పడవేయడానికి, అశాంతిని సృష్టించడానికి ఈ కొద్ది మందే చాలు!

పల్లె ప్రాంతాల పరిస్థితి కూడా ఇందుకు భిన్నంగా లేదు. లాహోర్‌లో కత్తిపోట్లు పొడిచే వారి సంఖ్య మహా అయితే రెండొందలు ఉండొచ్చు. అమృత్‌సర్ విషయంలో కూడా ఇదే అభిప్రాయం వినబడుతోంది. ఇక రెండు వర్గాలవారు కూడా తమ వర్గం ప్రజలపై జరుగుతున్న దౌర్జన్య గాథలను వినీ వినీ వారి సహాయం కోసం చేయగలిగినంత చేస్తున్నారు. అయితే ఈ సహకార భావన అన్ని చోట్ల కనబడడం లేదు.

గమనార్హమయిన మరో విషయం ఏమిటంటే, ఒక వంక కొంత మంది వ్యక్తులు దుశ్చేష్టలలో నిమగ్నమయి ఉండగా, మరో వంక పశ్చిమ పంజాబ్‌లోనూ తూర్పు పంజాబ్‌లోనూ సత్కార్యాలలో పాల్గొన్నవారు చాలా మంది కనిపించారు.

ముస్లిములు శిక్కు సోదరీ సోదరుల ధన మాన ప్రాణాలను కాపాడిన సంఘటనలను గురించి మేము ఖుద్దుగా ముస్లిముల రక్షణలో ప్రాణాలు కాపాడుకొన్న వారి నోట విన్నాము.

ఉదాహరణకు చక్వాల్‌లోని శరణార్థులెందరో మా చుట్టూ చేరారు. మేము వారి గోడు విన్నాము. అందరి గోడు ఇంచుమించు ఒకే విధంగా ఉంది.

"ఇక్కడ కొంతమంది హత్య జరిగింది. కొన్ని ఇళ్ళు దహనం అయ్యాయి. మా సామానులు దోచుకున్నారు. మమ్మల్ని తరిమికొట్టారు." ఈ రకంగా ఉన్నాయి వారి ఫిర్యాదులు.

అయితే ప్రతి చోటా కొంతమంది హిందూ శరణార్థులు వెలిబుచ్చిన అభిప్రాయాలు ఈ విధంగా ఉన్నాయి:

"ఇక్కడ అల్లర్లు ప్రారంభమయినప్పుడు సజ్జనులయిన ఇక్కడి ముస్లిములు కొందరు, పొరుగుననుండే హిందూ శిక్కు సోదరుల్ని రక్షించేందుకు ముస్లిం దుండగులతోనే తలపడ్డారు." ఇవి మేము అడిగిన ప్రశ్నలకు వారిచ్చిన సమాధానాలుకావు. ప్రజలు వారికి వారే ఈ గాధలను చెప్పుకున్నారు.

సరిగ్గా ఇదే విధమయిన అభిప్రాయాలను తూర్పు పంజాబ్‌లోని ముస్లిం శరణార్థులు కూడా మా ముందు వెల్లడించారు.

గూడ్‌గాఁవ్ జిల్లాలో 'మేవ్' అనే తెగకు, జాట్‌లకు మధ్యగల పోరాటం విచిత్రమయింది. 'మేవ్' తెగవారు ఒకప్పుడు రాజపుత్రులు. వారు ఇస్లాం స్వీకరించారు. వీరి ఆచార సంప్రదాయాలు చాలా వరకు రాజపుత్రుల ఆచార వ్యవహారాలను పోలి ఉండేవి. ప్రస్తుతం మత కలహాలు జరుగుతున్న సమయంలో హిందువులలోని మతతత్వ వాదులు రాజపుత్రుల వైపునకు, ముస్లిములలోని మతతత్వ వాదులు 'మేవ్' తెగ వైపునకు వెళ్ళి సామరస్య వాతావరణాన్ని కలుషితం చేయసాగారు. 'మేవ్' తెగకు - రాజపుత్రులకు మధ్య ఉద్రిక్తత నెలకొనసాగింది. ఆఖరికి అదొక తగవుగా మారిపోయింది.

'మేవ్' తెగవారు నివసించే బస్తీలలో ముస్లిములే ఎక్కువగా ఉంటున్నా వారి మధ్య కొన్ని హిందువుల ఇళ్ళు కూడా ఉండేవి. అదే విధంగా జాట్‌లు

నివసించే ప్రాంతాలలో ముస్లిములు అల్ప సంఖ్యలో ఉండేవారు. మాజీలో వీరు కూడా జాట్ తెగకు చెందినవారే. మేవ్ తెగకు, జాట్‌లకు మధ్య ప్రారంభమయిన పోరాటం చాలా రోజులు కొనసాగింది.

'మేవ్' తెగవారు నివసించే ప్రాంతాలలో వుంటున్న హిందువులు జాట్‌లతోనూ, 'జాట్'ల బస్తీలలో ఉండే ముస్లిములు వారితో కలసి 'మేవ్' ముస్లిములతోనూ పోరాడేవారు. ప్రతి ఒక్కడూ తన గ్రామం పట్ల విశ్వాస పాత్రుడుగా ఉండేవాడు. పోట్లాడుకునే వారి సంఖ్య ఇరువైపులా వేలల్లోనే ఉండేది. వీరు పగలంతా పోరాడుకునే వారు. సాయంత్రం ఒక చోట చేరిపోయేవారు. అంటే 'మేవ్' తెగకు చెందిన ముస్లిములు, హిందూ జాట్‌లు ఏకమయిపోయేవారు. పిచ్చాపాటిగా మాట్లాడుకుంటూ పరస్పరం ఆరోపించుకునేవారు. పరాయి మనుషుల చదరంగంలో పావులుగా మారి స్వంత ఇంట్లో శాంతిని భగ్నపరుచుకుంటున్నామని నిందించుకునేవారు. ఈ కథ చాలా రోజులు కొనసాగింది. అయితే ఈ పోరాటం సాగుతున్నంతకాలం 'మేవ్' తెగకు చెందినవారు ఏ స్త్రీనిగాని, చిన్న పిల్లలనుగాని ముట్టుకోలేదు. జాట్‌లు కూడా ఈ సూత్రానికే కట్టుబడి ఉన్నారు.

ఆఖరికి ఒక రోజున ఇరు వర్గాలకు జ్ఞానోదయం అయింది. మరుసటి ఉదయాన వారు సైనికులు, జిల్లా అధికార్ల సమక్షంలో, తామిక ఎన్నడూ పోరాడుకోమని ప్రతిజ్ఞ చేశారు. తమ మధ్య జగడానికి కారకులయిన స్వార్థపరులను వారు ధూత్కరించారు. ఇక ఎన్నడూ స్వార్థపరుల జాలంలో చిక్కి, పరస్పరం కొట్లాడుకోమని మాట ఇచ్చారు.

నవంబరు 5వ తేదీన మళ్ళీ నేను గూడ్‌గాఁవ్ జిల్లా వెళ్ళాను. 'మేవ్' తెగకు చెందిన ముస్లిములు, జాట్‌లు కలసిమెలసి ఉండటం చూసి నాకెంతో ఆనందం కలిగింది. కాకపోతే వారిలో ఒక్క ప్రత్యేకత కనిపించింది... మతకలహాలను సృష్టించడానికి కుట్రలు చేసే వారిని వారు ఏ మత వర్గానికి చెందినవారయినా తమ దరికి రానిచ్చేవారుకాదు.

- గాంధీజీ ప్రత్యేక దూత, సుందర్‌లాల్ కలం నుండి, 'పంజాబ్ మనకు నేర్పేదేమిటి'

## 15. బాధితుల హక్కు కోసం

పాకిస్తాన్‌లో పశ్చిమ పంజాబ్‌కు చెందిన ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ మిస్టర్ ఖుర్బాన్ అలీ శాంతి భద్రతల స్థాపన కోసం అహర్నిశలు పాటు బడిన అధికారిగా గుర్తింపుపొందారు. ఆయన రాజకీయ పలుకుబడి గల ఇద్దరు శాసన సభ్యులను, హిందువుల ధనసంపదను దోచుకున్న ఒక ముస్లిం సెషన్ జడ్జీని అరెస్టు చేయటంలో ఏమాత్రం తాత్సారం చేయలేదు. ఈ విధంగా ఆయన బాధిత సోదరులకు అండగా నిలిచి వారికి న్యాయం జరిగేలా చూశారు.

(సుందర్ లాల్, సిద్కె జదీద్, 2-1-1948లో)

## 16. దేవాలయానికి సహాయం

ప్రస్తుత కాలంలో కూడా హైదరాబాదులో సీతా రామాలయానికి హైదరాబాద్ సంస్థానం తరపున సహాయం లభిస్తుంది. ఆదిలాబాదులోని మరో దేవాలయానికి కూడా ఒక జాగీరు కేటాయించబడింది. దాని సాలుసరి ఆదాయం ఇంచుమించు ఐదువేల రూపాయలుంటుంది. నాందేడ్‌లోని సిక్కుల గురుద్వారాకి కూడా నిజాం ప్రభుత్వం జాగీరును రాసి ఇచ్చింది. దాని ద్వారా సాలీనా ఇరువై వేల రూపాయల ఆదాయం సమకూరేది.

-డా. రాజేంద్ర ప్రసాద్, భారత మాజీ రాష్ట్రపతి, "భారత భవితవ్యం" నుండి

## 17. బలహీనతను సొమ్ముచేసుకోవటమా?

సుల్తాన్ షహీద్ ముహమ్మద్‌సాకు, నహర్‌వాలా (గుజరాత్)ను జయించటంలో సఫలీకృతుడు కాలేదు సరికదా చావుతప్పి కన్నులొట్టపోయి స్వస్థలమయిన గజ్‌నైన్‌కు చేరుకోగలిగాడు. తనకు జరిగిన పరాభవానికి ప్రతీకారం తీర్చుకునేందుకు యుద్ధ సన్నాహాల్లో నిమగ్నుడైపోయాడు. ఆ రోజుల్లోనే ఎవరో అతనికి ఒక అర్జీ పంపించారు. నహర్‌వాలాలో విశాల అబ్బార్ అనే ఒక ప్రముఖ వర్తకుడు ఉన్నాడనీ, అతడు లక్షలాది రూపాయల విలువైన వర్తక సామగ్రిని విదేశాలకు పంపిస్తుంటాడనీ, ప్రస్తుతం పదిలక్షల విలువచేసే

వర్తక సామగ్రి గజ్‌నైన్ సమీపానికి వచ్చి ఉందని ఆ అర్జీలో వివరించబడింది. చక్రవర్తి గనక తలచుకుంటే ఆ సామగ్రినంతటినీ జప్తు చేసుకుని ప్రభుత్వ ఖజానాలో జమచేసుకోవచ్చని కూడా ఆ అర్జీలో సలహా ఇవ్వబడింది. ఆ అర్జీ పత్రానికి వెనుక సుల్తాన్ ఇలా వ్రాసి పంపాడు:

"విశాల అబ్బార్ సొమ్ము నహర్‌వాలాలో ఉండగా మేము దాన్ని జప్తు చేసుకోగలిగితే అప్పుడది మాకు ధర్మసమ్మతం అవుతుంది. గజినైన్‌లో దాన్ని కబళిస్తే అది మా పాలిట అధర్మం." ('జవామె ఉల్ హికాయాత్' నుండి)

## 18. నమ్మకం

లాలా సర్జూ ప్రసాద్ ఒకసారి మాటల మధ్య ఈ విషయం చెప్పారు: మేము మా నాన్నగారి నోట అనేకసార్లు విన్నాము- దరియాబాద్‌లో రోషన్‌లాల్ అనే ఒక ధర్మదాత ఉండేవాడు. ఆయన చలువ వల్ల చాలా సాధువులు, బ్రాహ్మణులు సుఖప్రదమయిన జీవితం గడిపేవారు. వందలాది మంది హిందువులు, ముస్లిములు లక్నో, దరియాబాద్ ప్రాంతాలలో ఈ పుణ్యాత్ముని శ్రేయం కోసం ప్రార్థించేవారు. ఆయన లక్నో పరిసర ప్రాంతాలలో ప్రధాన రహదారుల కిరువైపులా నీడ కోసం మామిడి చెట్లను నాటారు. ప్రజల సౌకర్యార్థం అనేకచోట్ల బావులు త్రవ్వించారు. అనేక ధర్మసత్రాలు నిర్మించారు. దరియాబాద్‌లో ధర్మదాత ఎవరంటే ప్రతి ఒక్కరూ ఆయన పేరు చెప్పేవారు. లక్నో పాలకుడయిన మియా అల్మాస్ అలీఖాన్‌కు రోషన్‌లాల్‌పై ప్రగాఢ విశ్వాసం ఉండేది. ఒకసారి దరియాబాద్‌లో గంజ్‌తాలాబ్ మస్జిద్, సరాయ్, శివాలయాల తదితర నిర్మాణ కార్యక్రమాలు జరుగుతున్న సందర్భంగా ఒక వ్యక్తి వచ్చి, అయ్యా! మీరు ఇచ్చే ధనాన్నంతటినీ రోషన్‌లాల్ తన స్వప్రయోజనాల కోసం వాడుకుంటున్నాడని రోషన్‌లాల్ గురించి అల్మాస్ అలీఖాన్‌కు ఫిర్యాదు చేశాడు. అల్మాస్ అలీఖాన్ దీని గురించి విచారించగా, ఫిర్యాదు అబద్ధమనీ, రోషన్‌లాల్ నిస్వార్థ సేవాభావంతో ప్రజోపయోగ పనుల్లో నిమగ్నులై ఉన్నారని తేలింది. రోషన్‌లాల్ పట్ల ఆయనకున్న గౌరవం మరింతగా పెరిగింది.

('తారీఖె దరియాబాద్'- పేజీ: 122)

# 19. ఇది పవిత్రత కాదు

నేను ముజప్ఫర్ నగర్‌లో పుట్టాను. ఒకసారి అక్కడ జరిగిన ఒక సదస్సుకు అధ్యక్షత వహించవలసినదిగా నాకు ఆహ్వానం అందింది. ఆ సదస్సుకు కొన్ని రోజుల క్రితం అక్కడి హిందూ-ముస్లింల మధ్య ఒక ఘర్షణ జరిగింది. దానికి కారణం ఆ ప్రాంతంలోవున్న ఒక చిన్న దేవాలయం! ఆ మందిరం వరకు గొనిపోయే ఒక చిన్న సందు ఉంది. ఆ మందిరానికి అనుకుని ఒక వేపచెట్టు ఉంది. ఆ చెట్టు ఒక పవిత్రమైన వృక్షంగా తలపోయబడేది. ఆ వీధిలో నుంచే పీర్ల యాత్ర కూడా సాగేది. పీర్ల పంజా కాస్త ఎత్తుగా ఉందో లేక కావాలనే అంత ఎత్తుగా తయారుచేయబడిందోగాని అది ఆ వేపకొమ్మలకు తగిలేది. తమ పీర్లకు అడ్డువస్తున్న వేప కొమ్మలను నరికివేయాలని ముస్లిముల పట్టుబట్టారు. ఇది ముమ్మాటికీ జరిగే పనికాదనీ, కావాలంటే మీరే మీ పీ యాత్రను మరో వీధి గుండా పోనివ్వండి; లేదంటారా మీ పీర్ల ఎత్తును కా కుదించండి. అలా కూడా వీలుపడదనుకుంటే నేలను తవ్వి (వేపమండలక పీర్ల పంజా తగలకుండా ఉండేలా) నడవండి అని హిందువులు సలహ ఇచ్చారు. ఎవరూ తక్కువేమీ కాదు. ఫలితంగా మతకలహం జరిగింది పదమూడేళ్ల ఒక బాలికను ఆ మతకలహం పొట్టనబెట్టుకుంది.

ఈ వ్యవహారం గురించి కూడా కాస్త మాట్లాడండి అని చాలా మంది స్థానికులు నన్ను కోరారు. నేనేమని చెప్పాలి? ఎవరికి చెప్పాలి? ఏం చెబితే ఏం తంటా వస్తుందో! ఆఖరికి నా వంతు వచ్చింది. ఆ వివాదాస్పద విషయాన్ని కూడా ప్రస్తావించాను. దీని గురించి నా అంతరాత్మ ప్రబోధిస్తున్న దానిని ఎలుగెత్తి ప్రకటించాలనుకున్నాను.......... ప్రకటిస్తున్నాను. ఆ చెట్టు పాడైపోను అన్నదమ్ముల మధ్య చిచ్చుపెట్టి పడుచుపిల్లను పొట్టనబెట్టుకున్న ఆ వే కొమ్మలేకాదు, కూకటి వ్రేళ్లతో ఆ చెట్టు కూలిపోయినా ఫరావాలేదు!! అలా అన్నదమ్ముల మధ్య రక్తపాతం సృష్టించే ఆ పీర్ల పంజాలు పవిత్రం కావు కద అవి అపవిత్ర మైనవి!!! హిందూ-ముస్లిం సోదరులకు నేను ఏమని చెప్పేది? ఎలా చెప్పేది?! ఇదొక ప్రహసనం తప్ప మరేమీ కాదు. ఉసిగొల్పేవారు రెచ్చగొట్టేవారు చాలా మంది ఉన్నారు. కాని దైవానికి భయపడేవారు చాల కొద్దిమంది మాత్రమే.

- పండిట్ సుందర్‌లాల్ అలహాబాది (హిందూ-ముస్లిం ఏక్‌తా, 1-10-1944

# 20. 15 రోజులు పాయసం-15 రోజులు పలావు

1944 నాటి సంఘటన-

ఆ రోజుల్లో ఢిల్లీలో "శుద్ధి ఉద్యమం" జోరుగా సాగుతోంది. నేనూ, నా మిత్రుడు శంకర్‌లాల్ రైల్వేస్టేషన్ వద్ద జట్కాపై కూర్చొని క్వీన్స్ గార్డెన్ వైపునకు వెళ్ళే రోడ్డుగుండా సాగిపోతున్నాము. ఉదయం 10 గంటల సమయం! అప్పటికే ఢిల్లీలో హిందూ-ముస్లిం మతకలహాలు కూడా జరిగ్గాయి. రోడ్డు ప్రక్కన 10-12 ఏళ్ల కుర్రాడు ఏడుస్తూ కనిపించాడు. మేము బండి ఆపి ఆ కుర్రాణ్ణి సమీపించాము. ఆ అబ్బాయి వెక్కి వెక్కి ఏడుస్తూ ఇలా అన్నాడు: "మా ఊరు గ్వాలియర్ సమీపంలో ఉంది. నేను బ్రాహ్మణ కుటుంబీ కుడను, నన్ను ఓ ముసల్మాను పట్టుకుని వచ్చాడు, కొన్నాళ్లు తన దగ్గరే ఉంచుకున్నాడు. నన్ను ముసల్మానుగా మార్చాడు. ఇప్పుడు నన్ను నా మానాన వదిలేసి ఎక్కడికో వెళ్ళిపోయాడు. నేనిక్కడ ఆకలితో అలమటిస్తున్నాను."

ఇది విని నాకెంతో కోపం వచ్చింది. పది పన్నెండేళ్ల పసివాణ్ణి పట్టానికి పట్టుకురావటంలో ఏమయినా అర్థముందా? అన్న ఆలోచన బాధించింది. కడకు ఆ కుర్రవాణ్ణి ఇంటికి పిలుచుకువచ్చి స్నానం చేయించాను. కొత్త బట్టలు తొడిగించాను. సాయంత్రం ఒక ఆర్యసమాజ స్నేహితుని వద్దకు తీసుకెళ్ళి, ఈ అబ్బాయిని 'శుద్ధి' చేసి గ్వాలియర్‌లో అతని తండ్రి వద్దకు పంపమని సూచించాను, తదుపరి నేను ఇంటికెళ్ళిపోయాను.

15 రోజుల తరువాత నేను శంకర్‌లాల్‌తోనే కలసి జామా మస్జిదు దగ్గర్లోంచి వెళుతుండగా ఆ కుర్రాడే కనిపించాడు. 'బహుశా ఆ కుర్రాడే అనుకుంటాను' అని నా మిత్రునితో అన్నాను. సందేహం లేదన్నాడు అతను. ఆ కుర్రాడి చేతిలో కబాబు (వేయించిన మాంసం) ఉంది. మమ్మల్ని చూడగానే కబాబును దాచేస్తూ, కించిత్ తడబాటుకు లోనవుతూ, 'ఆ ముసల్మాను మళ్లీ నన్నిక్కడికి తీసుకొచ్చాడ'ని అన్నాడు.

ఆర్యసమాజం మిత్రులారా, ముస్లిమ్ మిత్రులారా, నాకు తెలుసు తప్పు ఎక్కడుందో. విషయం నాకు పూర్తిగా అర్థమయింది. ఆ రోజుల్లో ఆగ్రా, మురాదాబాద్, ఢిల్లీ పరిసరాల్లో 250 మందికి పైగానే ఇలాంటి కుర్రాళ్లి ద్విపాత్రాభినయం చేసేవారు. వాళ్లు రెండు వారాలు హిందువులుగా, మరో రెండు వారాలు ముస్లింలుగా నటించేవారు. ఎంచక్కా పక్షం రోజులు పాయసం లాగించి , మరో పక్షం రోజులు పలావు మెక్కేవారు. ఈ విధంగా వాళ్లు అటు ముస్లింలకు, ఇటు హిందువులకు కూడా టోపీ పెట్టేవారు. మిత్రులారా, మనం మాత్రం ముహమ్మద్ అలీని రామ్‌నాథ్‌గా, రామ్‌నాథ్‌ను ముహమ్మద్ అలీగా మార్చి హిందూ, ఇస్లాం మతాల ఔన్నత్యానికై పాటుపడుతున్నామని భావిస్తున్నాము.

- పండిట్ సుందర్‌లాల్ ('హిందూ-ముస్లిం ఏక్తా')

## 21. న్యాయం

ప్రఖ్యాత యాత్రికుడు ఇబ్నె బతూత భారతదేశ పర్యటనా వివరాలు రాస్తూ, సుల్తాన్ ముహమ్మద్ బిన్ తుగ్లక్‌ను ఎన్నదగిన న్యాయశీలునిగా, పరమత సహనశీలిగా పేర్కొన్నాడు. ఇబ్నె బతూత ఇలా రాశాడు:

"సుల్తాన్ ముహమ్మద్ బిన్ తుగ్లక్, తన సోదరుణ్ని అకారణంగా హతమార్చాడని నిందిస్తూ ఒక హిందూ సోదరుడు కేసు పెట్టాడు. వ్యవహారం న్యాయస్థానం దాకా వెళ్ళింది. అంగరక్షకులుగానీ, ఆయుధాలుగానీ లేకుండానే సుల్తాన్ న్యాయస్థానానికి వచ్చి ఖాజి (న్యాయమూర్తి)కి 'సలాం' చేశాడు. మర్యాదల్ని పాటించి న్యాయమూర్తి ముందు వినయపూర్వకంగా నిలబడ్డాడు. సుల్తాన్ న్యాయస్థానానికి వచ్చినప్పుడు న్యాయమూర్తి లేచినిలబడవలసిన అవసరం లేదని అంతకు ముందే ఆదేశం అందింది. కేసుపై విచారణ జరిగింది. సుల్తాన్ దోషి అని నిర్ధారణ అయ్యింది. హతుడి సోదరుడితో రాజీ చేసుకోనైనా చేసుకోవాలి. లేదా హత్యాపరిహారమైనా చెల్లించాలని తీర్పు ఇచ్చాడు ఖాజీ. సుల్తాన్ ఎట్టకేలకు హతుడి సోదరుడితో రాజీ కుదుర్చుకున్నాడు. ఖాజీ రాజును విడుదల చేశాడు."

-ఇబ్నె బతూత 'భారతయాత్ర' లోని ఒక భాగం (సం. 25, పేజి: 13)

# 22. మానవత్వానికి మచ్చుతునక

తూర్పు పాకిస్తాన్ (నేటి బంగ్లాదేశ్) ప్రభుత్వం అక్కడి మైనారిటీలయిన హిందువులను అదే పనిగా వేధించి వారు దేశం వదలి ఇండియాకు వెళ్ళక తప్పని పరిస్థితిని సృష్టిస్తోందని చాలా మంది భావిస్తున్నారు. ఇది తప్పు. వాస్త వానికి పాకిస్తాన్ ప్రభుత్వంగానీ, పాకిస్తానీ బెంగాలీలుగానీ మన పట్ల ఏమాత్రం అతిగా ప్రవర్తించలేదు.

ఉత్తర భారతంలోనూ, పశ్చిమ పాకిస్తాన్‌లోనూ ప్రజలు మతం పేరిట మారణహోమం సృష్టించి, లూటీలు, దహనాలతో ప్రజా జీవితాన్ని అస్తవ్యస్తం చేసేస్తున్న రోజుల్లో జరిగిన ఒక సంఘటన- ఒక హిందూ సోదరుడు తన ఇద్దరు వితంతువు, తోబుట్టువులతో, పెళ్ళీడుకొచ్చిన మేనకోడలితో కలసి తూర్పు పాకిస్తాన్‌లోని ఒక జిల్లాలో నివసించేవాడు. ఆ జిల్లా జనాభాలో 92 శాతం ముస్లింలే. అయితే మేము ఉండేది ఒక ఇస్లామీయ రాజ్యంలోనన్న భయం ఒక్క క్షణం కూడా మమ్మల్ని వెంటాడలేదని దైవం సాక్షిగా చెబుతున్నాను. మా మతం ప్రమాదంలో పడిందన్న ఆలోచన కూడా ఏనాడూ మాకు కలగలేదు. ముస్లిం సోదరులు ఎల్లప్పుడూ మా శ్రేయాన్ని అభిలషించారు. మాకు ఉపకారం చేశారు. వాళ్ల ఈ మేలుకుగాను మేము జీవితాంతం వారికి రుణపడి ఉంటాము. ముస్లిం కాందిశీకులు ఏనాడూ హిందువుల యెడల చెడుగా ప్రవర్తించలేదు. ఈ కాందిశీకులంతా బీహార్, ఢిల్లీ ప్రాంతాల నుండి వచ్చినవారే. పాక్ ప్రభుత్వం గానీ, పాకిస్తానీ ముస్లింలుగానీ మా పట్ల మితిమీరి ప్రవర్తించారని ఎవరయినా అంటే అది ధర్మం కాదు. చిట్టగాంగ్‌లో ఉన్న రోజుల్లో ఒకసారి కొంత మంది కాందిశీకులు హిందువులు నివసించే పేటల్లో గొడవ చేశారు. అయితే వెంటనే ప్రభుత్వం జోక్యం చేసుకుని మమ్మల్ని రక్షించింది. నా స్టూడెంట్స్ అయిన కొంత మంది విద్యార్థినులు వచ్చి నా కుటుంబాన్ని, నా మేనకోడలిని కాపాడారు.
-ప్రొ. పండిట్ రంజీత్ బెనర్జీ, ఢాకా యూనివర్శిటీ, -మదీనా (బిజ్‌నూర్) (సిద్క్‌జదీద్, 15-8-1949లో ఉటంకించబడింది.)

# 23. సాక్ష్యం

అక్బర్ చక్రవర్తి కాలంలో అలహాబాద్‌లో యమునా నది ఒడ్డున ఓ కోట నిర్మించబడింది. ఆ కోటలోని సువిశాలమైన భూగృహంలో హిందువుల ఆరాధానాలయమొకటి ఇప్పటికీ భద్రంగా ఉంది. అక్కడొక వటవృక్షం ఉంది. హిందూ మత విగ్రహాలు చెట్టు క్రింద ప్రతిష్టించబడి ఉన్నాయి. వేలాది మంది హిందువులు వాటిని సందర్శిస్తున్నారు. పూజలు చేస్తున్నారు, మొక్కుబడులు చెల్లించుకుంటూ ఉన్నారు. హిందూ "పాండే" పూజారులు తమ విశ్వాసం ప్రకారం పూజా పురస్కారాలను నిర్వహిస్తున్నారు.

మొగలాయి చక్రవర్తుల పరంపరలో ఔరంగజేబు కూడా ప్రముఖుడే. ఈ కోట ఔరంగజేబు అధీనంలో ఉండేది. పరమత ద్వేషిగా పిలువబడే ఆ మహానుభావుడు, తాను తలచుకుంటే చాలా సులువుగా ఆ ఆలయాన్ని, ఆ విగ్రహాల్ని నేలమట్టం చేసేవాడు. కాని అలా జరగలేదు. విగ్రహాల నిర్మాణం, వాటి శిల్పాన్ని బట్టి అవి వేలాది సంవత్సరాల క్రితం తయారయినవని తెలుస్తున్నది. ఆ విగ్రహాలలో ఏదీ చెక్కుచెదర కుండా సురక్షితంగా ఉన్నాయి.

ఒకవేళ ఔరంగజేబు పరమతాలను ద్వేషించేవాడు, విగ్రహాలను విరగ్గొట్టేవాడూ అయితే అన్నిటికన్నా ముందు ఈ విగ్రహాలను తుదముట్టించి ఉండేవాడు.

-బాబు రామ్ నారాయణ్, రామ్‌నగర్ సంస్థానానికి మాజీ మేనేజర్, (హమ్‌దమ్ పత్రిక, లక్నో, డిశెంబర్, 1924)

# 24. చెరగని నమ్మకం

హైదరాబాదు నగర నిర్మాత, దక్కన్ నవాబయిన ముహమ్మద్ కులీ కుతుబ్‌షాహ్ ప్రజలు, అధికారుల పట్ల దయాదాక్షిణ్యాలతో వ్యవహరించే వాడు. అతని ప్రవర్తనను చూస్తుంటే హిందూ ముస్లింల మధ్య అతను ఇసుమంత విచక్షణను కూడా పాటించినట్టు కనబడదు. ఎల్లప్పుడూ ఉభయుల పట్ల సమానంగా వ్యవహరించేవాడు. తన రాజ్యంపై తిరుగుబాటును ప్రకటించిన

హిందూ ముస్లిం రాజులను అణచడానికి ఎప్పుడూ హిందూ సైన్యాధికారులనే పంపాడు కులీ కుతుబ్‌షాహ్. అతని విశాల దృష్టికి, పరమత సహనానికి ఇంతకు మించిన నిదర్శనం అక్కరలేదేమో!

- డా. జోర్ (ముహమ్మద్ కులీ కుతుబ్ షాహ్, పేజీ:325)

## 25. మతం మార్పిడులను గురించి

జైళ్ళలో హిందువులను బలవంతంగా ముస్లింలుగా మారుస్తున్నారని హైదరాబాద్‌లోని ఆర్యసమాజ్ నాయకులు ప్రభుత్వానికి ఫిర్యాదు చేయగా ప్రభుత్వం విచారణ జరిపించి పత్రికా ప్రకటనను విడుదల చేసింది:

"ప్రభుత్వానికి తెలిసినంత వరకూ నిజాం సర్కారు పరిధిలో వున్న ఏ కారాగారంలోనూ, ఏ ఖైదీనీ ముస్లింగా మార్చటం జరగలేదు. ఇస్లాం స్వీకరించమని అన్యమతస్థుల్ని తాకీదు చేయటం గానీ, అన్యులకు ఇస్లాం శిక్షణ నివ్వటంగానీ జరగలేదు. అసలు విషయం ఏమిటంటే, గత మూడేళ్లలో నలుగురు ఖైదీలు తాము ముస్లింలుగా మారదలచుకున్నట్లు ప్రభుత్వానికి అర్జీ పెట్టుకున్నారు. వారి అభ్యర్థనను పురస్కరించుకుని జైళ్ల నిర్వహణాధికారి స్వయంగా ఆ ఖైదీలను కలుసుకుని, విచారణ జరిపి ఆపైన వారికి మతం మార్చుకునే అనుమతినిచ్చాడు. అయితే ప్రస్తుతం నెలకొన్న అపార్థాన్ని రూపుమాపటానికై ప్రభుత్వం ఆదేశాలు జారీ చేసి, కారాగారంలో అడుగుపెట్టే రోజున నేరస్థుడు ఏ మతానికి కట్టుబడి ఉన్నాడో ఆ మతానికే కారాగారంలో కూడా కట్టుబడి ఉండాలనీ, వేరొక మతాన్ని స్వీకరించరాదని ఆంక్ష విధిస్తోంది."

(హైదరాబాదులో ఆర్య సమాజ ఉద్యమం- ఆసఫియా ప్రభుత్వం తరపున వెలువరించబడిన పుస్తకం-పేజీ : 690)

## 26. మస్జిద్ నిర్మాణం ఆగిపోయింది

1930 నాటి సంఘటన. మత వ్యవహారాల శాఖాధికారి ఒక మస్జిద్ నిర్మాణాన్ని నిలిపివేస్తూ ఆజ్ఞలు జారీ చేయవలసి వచ్చింది. దాని వివరాలు ఇలా ఉన్నాయి:

(ఆనాడు) హైదరాబాదులోని ఆబిద్‌షాపు ప్రాంతంలో ఒక మస్జిద్ కూడా లేదు. పైగా అక్కడ నివసించేవారంతా ముస్లింలే. ఇక్కడ వ్యాపారం కూడా జోరుగా సాగుతుంది. వ్యాపారుల్లో కూడా ముస్లిములే అధికం. ఇంకా, ఆ ప్రాంతంలో ఒక హైస్కూలు, ఒక ప్రైమరి స్కూలూ ఉన్నాయి. బాలికల పాఠశాల ఒకటి ఉంది. హైదరాబాదు సంస్థానపు అన్నింటికంటే పెద్ద గ్రంథాలయం (ఆసఫియా లైబ్రరి) ఇక్కడే ఉంది. ఇక్కడ మస్జిద్ మాత్రం లేదు. ముస్లిం వ్యాపారస్తులు, విద్యార్థులు గ్రంథాలయానికి వచ్చేవారు- వీరంతా నమాజు కోసం వేరొక వీధికి దూరంగా నడిచిపోవలసి వచ్చేది.

ఈ అసౌకర్యం దృష్ట్యా ఆబిడ్స్‌లోని ఆమిరా అనే గుర్రపు శాలలో మస్జిద్ ఒకటి నిర్మించుకోవటానికి అనుమతి ఇవ్వవలసినదిగా ముస్లిములు మత వ్యవహారాల శాఖకు అర్జీ పెట్టుకున్నారు. ఆనాడు మత వ్యవహారాల శాఖ అనుమతి లేనిదే మస్జిద్‌గాని, కాన్‌కాహ్‌గాని, ఆషుర్‌ఖానాగాని కట్టుకోవడానికి వీల్లేదు. మస్జిద్ కట్టుకోవడానికి అనుమతి లభించింది. నిర్మాణం ప్రారంభమయింది. దాదాపు నిర్మాణం పూర్తికావస్తుండగా, హిందూ సోదరులు కొందరు అభ్యంతరం తెలుపుతూ అధికారికి దరఖాస్తు పెట్టుకున్నారు. నూతన మస్జిద్ నిర్మాణానికి సమీపంలో ఒక దేవాలయం ఉండటం వల్ల అక్కడ మస్జిద్ ఉండకూడదని హిందువులు పట్టుబట్టారు. ఇక్కడ మస్జిద్ నిర్మించటం వల్ల హిందువులలో అభద్రతా భావం చోటు చేసుకుంటుందని తలపోసి మత వ్యవహారాల శాఖ వెంటనే మస్జిద్ నిర్మాణాన్ని ఆపు చేయవలసిందిగా ఉత్తరువులు జారీ చేసింది. ఆ కట్టడంలో కేవలం ఒక ధార్మిక పాఠశాల పెట్టుకోవడానికి మాత్రం అనుమతి లభించింది.

-హైదరాబాదు రాజ్యానికి వ్యతిరేకంగా జరిగే ప్రచారానికి సమాధానం

## 27. అనుమానం - ఆనందం

నేను హైదరాబాద్ వైపునకు పయనమయ్యాను. ఆ సమయంలో హైదరాబాదులో దేవాలయాల దుస్థితి గురించి పత్రికలు ప్రచురించిన వార్తలు నా మదిలో మెదిలాయి. హైదరాబాదు చేరిన తరువాత, దేవాలయాల పట్ల ఉపేక్ష తగదని అక్కడి పాలనాధీశులకు చెబుదామని దారిలో సంకల్పం

చేసుకున్నాను. తీరా హైదరాబాదుకువచ్చి అనేక కోణాల నుంచి విచారించాక ఒక విధంగా సంతోషం కలిగింది. దేవాలయాల గురించి హిందూ పత్రికలు వ్రాసిందంతా అబద్ధమని తేలిపోయింది. వారు పక్షపాతంతో తప్పుడు సమాచారం వ్రాశారు. వాస్తవానికి ప్రభుత్వం తరపున దేవాలయాలకు ఆర్థిక సహాయం అందేది. ముస్లింల ఆరాధనాలయాలకంటే హిందువుల దేవాలయాలు ఎక్కువగా ఉన్నాయి. -పండిత్ రాజ్‌నారాయణ్ సనాతన ధర్మవేత్త, 'హయాతె ఉస్మానీ' పేజి: 346

## 28. సామాజిక సంబంధాలు

హైదరాబాదు (సంస్థానం)లో ఒక ముస్లిం ఇంట పెళ్లి జరిగినా, మొదటి నుంచి ఇరుగుపొరుగు హిందూ సోదరులు పెళ్లి పెద్దలుగా కీలక పాత్ర పోషించేవారు. సంబంధం చూడటం నుంచి పెళ్ళయ్యే వరకూ ప్రతి విషయంలో వాళ్లు సలహా ఇస్తుండేవారు. ఒక్కోసారి పెత్తనమంతా వారి చేతుల్లోనే ఉండేది.

ముస్లిం సోదరుడు తమ పిల్లల పెళ్లి విషయంలో ఎంత బద్ధకంగా వ్యవహరించినా తమ హిందూ మిత్రుని ఒత్తిడికి తలఒగ్గక తప్పేది కాదు. ముస్లిం భాయి దగ్గర ఆర్థిక స్థోమత లేనిపక్షంలో హిందూ సోదరుడు డబ్బులు సర్దేవాడు. తన దగ్గర చాలినంత డబ్బులేకపోతే అప్పొసప్పొ తెచ్చయినా అవసరానికి ఆదుకునేవాడు. ఈ విధంగా వివాహ మహోత్సవాల సందర్భంగా హిందూ సోదరులు ముస్లింల ఆర్థిక సమస్యలను పరిష్కరించి నిజానికి తమ పిల్లల పెళ్ళిళ్ళే జరుగుతున్నాయా అన్నంతగా శ్రద్ధ వహించేవారు.

హిందువుల ఇంట వివాహ మహోత్సవం జరిగినా అంతే. ముస్లిం సోదరులు రెక్కలు కట్టుకుని వాలేవారు. తమకు చేతనయిన సహకారాన్ని మనస్ఫూర్తిగా అందించేవారు. ఒకనాడు నేను నా కళ్ళారా చూసిన సంఘటన- ఒక హిందూ సోదరుని ఇంట అబ్బాయి వివాహం నిశ్చయమైంది. వరుని తండ్రి పరిమిత ఆదాయం గలవాడు. వెంటనే ఇద్దరు ముస్లిం మిత్రులు పెళ్ళికి కావలసిన మొత్తాన్ని సమకూర్చారు. మీకెందుకీ శ్రమ? అంటూ వరుని తండ్రి ఇబ్బంది ఫీలవగా, "ఫరవాలేదు, మీరు ఇవ్వగలిగినప్పుడే తిరిగి ఇవ్వండి" అని వారు జవాబిచ్చారు.

వివాహ మహోత్సవాలలో హిందువుల ఇంట ముస్లింలు, ముస్లింల ఇంట హిందువులు కనిపించేవారు. హిందూ బాధితులకు ముస్లింలు సహాయపడగా, ముస్లిం బాధితులకు హిందువులు అండగా నిలిచేవారు.

-రాయ్ వెంకట్ ప్రసాద్ (హైదరాబాద్ దక్కన్ మరియు హిందూ ముస్లింల జీవితాలు)

## 29. వాత్సల్యభరితమైన కానుక

భారత మాజీ రాష్ట్రపతి అంతరంగిక సిబ్బందిలో పనిచేసే వారిలో ఖాదిర్ బక్ష్ ఖాన్ అనే ముస్లిం కూడా ఉండేవాడు. రాష్ట్రపతి పదవీ విరమణ చేసినప్పుడు ఢిల్లీకి చెందిన 'స్టేట్స్‌మన్' దినపత్రిక విలేకరి ఈ ఉద్యోగిని కూడా ఇంటర్వ్యూ చేసి రాష్ట్రపతి గురించి నీ అభిప్రాయం ఏమిటీ? అని ప్రశ్నించాడు. దానికి అతడు ఇచ్చిన సమాధానంతో పాటు అతని ఫోటోను కూడా ఆ పత్రిక ప్రచురించింది. అతనిలా అన్నాడు:

"భారత రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ నిరాడంబరతకు నా జోహార్లు. ఒకనాటి సంఘటనను నేను ఎన్నడూ మరువలేను. ఆనాడు ఉదయం ఆయన తన గదిలో పూజలో నిమగ్నులై ఉన్నారు. దగ్గరలోనే నేను కూడా నమాజ్ చేసుకుంటున్నాను. ఆయన దృష్టి నాపై పడింది. వెంటనే నన్ను దగ్గరకు పిలిచి, ఎంతో వాత్సల్యంతో గంధపు కొయ్యతో చెయ్యబడిన జపమాలను నాకు బహూకరించారు."

(సిద్ఖె జదీద్: 25-5-1962)

## 30. ప్రతి పువ్వునూ విరియనీ...

ప్రభుత్వం తన సంస్కృతిని దాన్ని స్వీకరించడానికి ఇష్టపడని ప్రజలపై బలవంతంగా రుద్దేదికాదు. ముస్లింల మదర్సాలు, విద్యాపీఠాల ద్వారాలు ప్రజలందరి కొరకు తెరచుకుని ఉండేవి. కాని వాటిలో దాఖలా తీసుకొని తీరవలసిందేనని ఎవరినీ బలవంతం చేసేవారు కారు. ప్రభుత్వాలు పండితులను, హిందూ మత విద్యలను, సంస్కృతిని గౌరవించేవి. అల్ బెరూనీ గ్రంథస్థం చేసిన విషయాల ద్వారా కూడా ఈ సంగతి రూఢీ అవుతోంది. (ముస్లిం) ప్రభుత్వాలు ముస్లిం విద్వాంసుల ద్వారా సంస్కృత గ్రంథాలను పారసీక భాషలో

తర్జుమా చేయించారు. ఇలాంటి అనువాదాలు చేయడానికి ముస్లిం విద్వాంసులు సంతోషంగా ముందుకు రావటం కూడా విశేషమే. హిందువుల సంస్కృతిని, విద్యలను కొనియాడటంలో ముస్లిం విద్వాంసులు ఎలాంటి పిసినారితనం చూపలేదన్న వాస్తవం కూడా ఆ గ్రంథాల అధ్యయనం ద్వారా స్పష్టమవుతుంది. వాస్తు శిల్పానికి సంబంధించిన కొన్ని హిందువుల సంప్రదాయాలను కూడా ముస్లింలు తమ వాస్తు కళలో అంతర్లీనం చేసుకున్నారు. ముస్లిములంతా ఒకచోట సమావేశమై తమ నిజదైవాన్ని ఆరాధించే మస్జిదు గోడల నిర్మాణంలోనూ, వేదికలపైనా ఆ ప్రభావం కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది.

టర్కీ సమరవీరులను సయితం హిందూ గాథలు, విషాదభరిత గీతాలు ఎంతగానో ప్రభావితం చేశాయి. ఖుస్రోలాంటి గొప్పవారే హిందూ సాంప్రదాయక గీతాలను తమ కవితలతో జోడించి పాడుకుని గర్వపడేవారు.

ముస్లిం సామ్రాజ్యాల పరిధిలో నివసించే హిందువులు తమ సమకాలీన హిందూ రాజుల రాజ్యంలో నివసించే హిందువులకన్నా సుఖశాంతులతో వర్ధిల్లారు. -డా. ఇష్తియాఖ్ హుసైన్ ('ఏక్ ఏక్ ఝలక్,' పుట: 405 సౌజన్యంతో)

## 31. ఆవు కోసం...

నజీబాబాద్‌లో జరిగిన సంఘటన-

అది క్రీ.శ. 19వ శతాబ్దం తొలి దశకంలో జరిగిన సంఘటన. నవాబ్ మొయినుద్దీన్ ఖాన్ వద్దకు ఓ హైందవ వితంతువు ఫిర్యాదు తీసుకువచ్చింది. తానెంతో ఆప్యాయంగా పెంచుకునే ఆవు యుక్త వయస్కుడైన పఠాన్ సర్దార్ కుమారుని తుపాకీ గుండుకు ఆహుతి అయి చచ్చిపోయింది అని ఆమె బాధతో మొరపెట్టుకుంది.

అంతే. నవాబ్ సాహెబ్ ఆగ్రహోదగ్రులయ్యారు. ఆవును పొట్టన బెట్టుకున్న ఆ యువకుడ్ని తుపాకీ గుండుతో కాల్చి చంపమని ఆయన హుకుం జారీ చేశారు. ఈ తీర్పు విని దర్బారు వారంతా హడలిపోయారు. ఒక ఆవుకు బదులుగా ఒక మానవ ప్రాణమా?! అని వారు ఆందోళన చెందారు. ఎలాగయినా

ఆ యువకుని ప్రాణాలు కాపాడాలని మంత్రులు, సర్దారులంతా కంకణం కట్టుకున్నారు. కాని నవాబ్ సాహెబ్ అందరి సిఫార్సులనూ త్రోసిపుచ్చారు. ఒక సగటు హిందూ మహిళకు తన దర్బారులో లభించే న్యాయం ఎటువంటిదో ప్రజలందరికీ తెలిసిరావాలని ఆయన నొక్కి వక్కాణించారు.

నవాబ్ సాహెబ్ ఆజ్ఞను పాలించే సమయం ఆసన్నమయింది. తన ఆవును చంపిన యువకునికి మరణదండన తప్పదన్న వాస్తవం ఆ మహిళకు కూడా తెలిసిపోయింది. ఈ విషయాన్ని తెలుసుకుని ఆమె తల్లడిల్లిపోయింది. ఏడుస్తూ దర్బారుకు వచ్చి నవాబు గారి కాళ్ళు పట్టుకుని, 'నాకు న్యాయం దొరికింది. ఇక తమరు ఆ అబ్బాయిని కనికరించండి. నేను నా ఫిర్యాదు వెనక్కి తీసుకుంటున్నాను' అని బ్రతిమాలింది. 'ఒకవేళ తమరు ఆ అబ్బాయికి మరణదండన విధించాలనే నిశ్చయించుకుంటే ముందు నన్ను చంపి, ఆ తర్వాత ఆ అబ్బాయిని శిక్షించండి' అని పట్టుబట్టింది. కడకు నవాబుగారు ఆ వితంతువు సిఫార్సును ఆమోదించారు. యువకుడు ప్రాణాలతో బయటపడ్డాడు. చంపబడిన ఆవుకు బదులు ఆ వితంతువుకు పెద్ద మొత్తంలో నష్ట పరిహారం చెల్లించబడింది. (ఆలమ్‌గీర్: హిందువోంకి నజర్‌మే)

## 32. సర్వమతాల పట్ల సమతౌల్యం

హిందూ బాలికలకై వేరుగా ప్రత్యేక పాఠశాలల్ని ఏర్పాటు చేయాలనే ఆలోచన నా మనసులో చాలా కాలంగా ఉండేది. నా పరిపాలనలోని ప్రజలు ఏ మతానికి, ఏ వర్గానికి చెందిన వారైనా నాకు ప్రియప్రదమైనవారే, సమానులే. ఏ పాలకుడైనా తన పాలనలో ఉన్న వివిధ వర్గాలకు చెందిన ప్రజల మధ్య వారి సంస్కరణ, ప్రగతి వికాసాలకు సంబంధించిన విషయాల్లో విచక్షణ పాటించ కుండా సమానతనే పాటించాలి. ముస్లిం బాలికల విద్య పట్ల ఎంత శ్రద్ధ ఉందో నాకు, హిందూ బాలికల విద్యా ప్రమాణాలకై పాటుపడాలన్నది కూడా నా ధ్యేయం. విభిన్న మతాల ఆవశ్యకతలు ఎదురుకాకపోతే ఇరువర్గాలకై వేర్వేరు పాఠశాలలు ఏర్పాటు చేసేవాడ్నికాను, అయితే ఒకే ప్రమాణం, ఒకే

ఎత్తున విద్య అందజేయ బడుతోంది, ప్రారంభ తరగతుల్లోనే ధార్మిక విద్యల్ని బోధించే పాఠ్యాంశాలు అధికంగా ఉన్నాయి. అందువల్ల ఇరువర్గాలకు ఒకే విద్యను బోధించే మార్గం లేదు. ఈ సంవత్సరమే బర్జీస్ జహాఁబేగం పేరిట హిందూ విద్యార్థినుల కొరకు ఓ పాఠశాలను ఏర్పాటు చేస్తున్నాను.

-సుల్తాన్ జహాఁబేగమ్, భోపాల్ సంస్థానాధీశురాలు (హయాతె సుల్తానీ)

## 33. తోడ్పాటు

హిందువుల కొరకు ఏర్పాటు చేయబడిన జైన్ శివనాంబర్ పాఠశాలకు పేద విద్యార్థుల కొరకు నిధుల సహాయాన్ని అందించే సందర్భాన భోపాల్ సంస్థానాదీశురాలు సుల్తాన్ జహాఁబేగం అచటి మహిళలు ఏర్పాటు చేసిన ఒక సభలో ప్రసంగిస్తూ ఇలా అన్నారు:

"నేనీ సందర్భంలో ఓ విషయాన్ని ప్రస్తావించదలిచాను. అది మీకూ తెలిసి ఉండవచ్చు. నేడు భారత దేశంలో ఎక్కడెక్కడయితే హిందూ విద్యార్థినుల కొరకు ప్రత్యేక విద్యాసంస్థలు, పాఠశాలలు, అనాధ శరణాలయాలు ఉనికిలోకి వచ్చాయో అవి కేవలం మహిళల సహకారం, కృషి ఫలితంగానే నెలకొల్పబడ్డాయని నాకు తెలిసింది. ఇదంతా మీ సోదరీమణుల కృషికి సజీవ తార్కాణం. భోపాల్‌లోని హిందూ మహిళలు కూడా ఇలాంటి కార్యక్రమాల్ని చేపట్టి వాటి అభివృద్ధికై కృషి చేస్తారని ఆశిస్తున్నాను." -'హయాతె సుల్తానీ' పేజి:74

## 34. నజీబుద్దౌలా? అజీబుద్దౌలా?

మూడవ పానిపట్టు యుద్ధం తరువాత నవాబ్ నజీబుద్దౌలా ప్రధాన మంత్రిగా పదవిలోకి వచ్చాడు. పన్నెండున్నర వేల చదరపు మైళ్ల సువిశాలమైన సారవంతమైన భూభాగం ఆయన జాగీరుగా ఉండేది. తిరుగులేని ప్రధానిగా ఏలుతున్న కాలంలోనే ఆయన తల్లి మరణించింది. నజీబాబాద్‌కు దగ్గరలో ఉన్న ఒక పొలంలోనే అంత్యక్రియలు జరపాలని నిశ్చయించారు. ఆ సమాధిపై ఒక గుమ్మటం నిర్మించాలని ఆ కుటుంబీకులు తలపోశారు. నజీబుద్దౌలాకు

గుమ్మటంపై ఆసక్తి లేకపోయినప్పటికీ, ఆయన సోదరుడు సుల్తాన్‌ఖాన్ గుమ్మటం నిర్మించి తీరాలని పట్టుబట్టాడు. మరి సమాధి కోసం త్రవ్విన ఆ పొలం నల్లరంపుర (రాంపూర్ బన్వారీ) జమీందార్ల అధీనంలో ఉండేది. ఆ జమీందార్లు జాట్ కులస్థులు. భూమి త్రవ్వేందుకు జాట్‌లు సుతరామూ ఒప్పుకోలేదు. వాళ్ల అంగీకారం లేకుండా నేలత్రవ్వటం నజీబుద్దౌలాకు కూడా ఇష్టం లేదు. ఎట్టకేలకు మరోచోట అంత్యక్రియలు జరపాలని నిర్ణయించారు.

యాదృచ్ఛికంగా ఆ భూమి కూడా హిందువుల సేద్యంలోనే ఉంది. ఆ మాటకొస్తే ఆ పట్టణం పరిసరాలలో ఉన్న భూమి అంతా హిందూ సోదరుల సేద్యంలోనే ఉందని తెలిసింది. తమ భూమిలో నజీబుద్దౌలా తల్లి ఖననం కావటం ఏ ఒక్క హిందువుకూ ఇష్టం లేదాయె! నజీబుద్దౌలా ఎంతగానో కలత చెందాడు. మరోవైపు ముస్లింల సర్వసాధారణ 'ఖబరస్తాన్'లో ఖననం చేయడానికి సోదరుడు సుల్తాన్ ఖాన్ ససేమిరా అంటున్నాడు. గత్యంతరంలేక నజీబుద్దౌలా మూడో మార్గం ఆలోచించాడు. ప్రత్యేక శవపేటిక తయారుచేసి (సరిహద్దు ప్రాంతంలో ఉన్న) 'మానారీ' కి తరలించి అక్కడ ఖననం చేయాలని ఆజ్ఞాపించాడు. ఆ ప్రాంతంలో నజీబుద్దౌలా వంశస్థులున్నారు. ఆజ్ఞానుసారం 'తాబూత్' తయారు చేయబడింది. భౌతికకాయాన్ని అక్కడికి తరలించే ఏర్పాట్లు జరుగుతున్నాయి. భౌతిక కాయం వెంట ఓ సైనిక బృందం కూడా వెళ్ళాలని ఆజ్ఞ జారీ అయింది. ఈ వార్త నలువైపుల వ్యాపించింది. జాట్ కులస్థులకూ తమ నిరాకరణ వల్ల ఎటువంటి పరిస్థితి ఏర్పడిందో తెలిసి వచ్చింది. నజీబాబాద్‌కు చెందిన కొంతమంది అజ్ఞానులు నోటికొచ్చినట్లుగా వెటకారం పలికారు: "ఇతగాడు నజీబుద్దౌలా కాదు, అజీబుద్దౌలా (విచిత్రమయిన మనిషి)! కాకపోతే ఏమిటీ?! పానిపట్టు యుద్ధంలో విజయానికి వారధిగా నిలిచినవాడు, అహ్మద్ షాహ్ అబ్దాలీ చేత ప్రశంసాపత్రం పొందినవాడు, భారతదేశ ప్రధాని, ప్రధాన సేనాధిపతి, ఢిల్లీ సింహాసనానికే చక్రవర్తి పక్షాన పాలిస్తున్నవాడు, ఇంత నిస్సహాయ స్థితిని కొనితెచ్చుకుంటాడా?! చనిపోయిన తన మాతృమూర్తికే ఈ గడ్డపై రెండు గజాల నేలను సంపాదించుకోలేక పోయాడా?!" అని ఎద్దేవా చేయసాగారు.

కాని మరోవైపు జాట్ కులస్థుల అంతరంగం అతలాకుతలమవుతోంది. నజీబుద్దౌలా తల్లి భౌతికకాయాన్ని మరో ప్రాంతానికి తరలిస్తున్నారన్న వార్తను వాళ్లు దిగమ్రింగలేకపోతున్నారు. వాళ్లంతట వాళ్లుగా పరుగులు తీస్తూ వచ్చి, "అయ్యా! మీ ఈ నిర్ణయాన్ని ఉపసంహరించుకోండి. దీన్ని మేము భరించ లేకుండా ఉన్నాము. మా పొలాల్లో మీకు ఇష్టమొచ్చిన స్థలాన్ని తీసుకుని మీ తల్లిగారి అంత్యక్రియలు జరుపుకోండి. గుమ్మటం కూడా నిర్మించండి. మనస్ఫూర్తిగా మేము ఇలా కోరుకుంటున్నామ"ని విన్నవించుకున్నారు. చాలా సేపటి వరకు నజీబుద్దౌలా ఒప్పుకోలేదు. చాలా మంది బ్రతిమాలిన మీదట అతికష్టమ్మీద తన సుముఖతను వ్యక్తపరిచాడు. అయితే నజీబుద్దౌలా ఇందుకు ఒక షరతు పెట్టాడు. జాట్‌లు ఆ స్థలానికి వెలకట్టి, డబ్బు తీసుకుని అమ్మినట్లు దస్తావేజు వ్రాసి ఇవ్వాలన్నాడు. ఆ లాంఛనాలన్నీ పూర్తయ్యాయి. ఇప్పుడా స్థలం "చౌగాముః" పేరుతో పిలువబడుతోంది. ఇప్పుడక్కడ జాట్ కులస్థులు లేరు, ఇతరుల జమిందారీలో ఉంది భూమి. కొనుగోలు చేసిన పొలంలో మాత్రం నజీబుద్దౌలా తల్లిగారి సమాధి ఉంది. ఆ సమాధి చుట్టూ ఒక గుమ్మటం నిర్మించబడింది. దాని ఆవరణలో ఇప్పుడు హైస్కూలు, హాస్టలు నడుస్తున్నాయి. అక్కడే దులారామ్ అనే గొడ్లకాపరి ఇల్లు, కార్ఖానా ఉన్నాయి. ఇంతకు ముందు ఆ స్థలంలో గుమ్మటానికి దారిచూపే ఒక బురుజు ఉండేది. ఇప్పుడు దాని ఆనవాళ్లు కూడా కనిపించవు. 'బారాదరీ' పేరుతో పిలువబడే నవాబ్ సుల్తాన్ ఖాన్ గారి తోట మాత్రం 1857 నుండి అనేక ఆటుపోట్లకు లోనవుతూ, అనేకమంది ఆక్రమణల్లోకి పోతూ, అస్తవ్యస్తంగా మారుతూ ఇప్పటికీ తన ఉనికిని చాటుకుంటూనే ఉంది. నజీబుద్దౌలా సయితం మరణించిన పిదప తన తల్లిగారి ప్రక్కనే ఖననం చేయబడ్డాడు. 1857 తరువాత రాంపూర్ నవాబు మరమ్మత్తు చేయించిన వీరిరువురి గుమ్మటాలు నేటి నజీబా బాద్ జనవాసానికి - రైల్వేస్టేషన్‌కు మధ్య భాగంలో ఉన్నాయి. వాటి పరిసరాలలో ఉన్న భూములన్నీ ఇప్పుడు "హిందూ సోదరుల అధీనంలో ఉన్నాయి."

(ఆలమ్‌గీర్- పేజీ: 20, నజీబాబాద్‌కు చెందిన అయూబ్ ఖాన్ కథనం)

# 35. ఆ రోజులు తిరిగివస్తాయా!

ఆ రోజుల్లో...

ముస్లింల ఇండ్లకు సాధారణంగా పెద్ద పెద్ద షావుకారులు, వాణిజ్యవేత్తలు, క్షత్రియులు, బ్రాహ్మణుల స్త్రీలు నిర్మొహమాటంగా- బంధువుల వలే- వస్తూ పోతుండేవారు.

ముస్లిముల ఇండ్లలో సాధారణంగా సువిశాలమైన వరండాలు, ఉద్యానవనాలుండేవి. రేగిచెట్లు, జామ, దానిమ్మ, నేరేడు వృక్షాలు దాదాపు ముస్లింల ఇండ్లల్లోనే కనిపించేవి. ఆనాడు హిందువుల ఇండ్లలో ఇలాంటి వృక్షాలుండేవికావు. అంచేత తమకు పరిచయస్థులైన ముస్లింల ఇండ్లకు హిందూ స్త్రీలు నిర్మొహమాటంగా వచ్చేవారు. ముస్లిం స్త్రీలు ఎంతో ఆప్యాయంగా వాళ్లను స్వాగతించేవారు. అక్క అని కొందరూ, అమ్మ అని కొందరు, అత్త అని మరికొందరు, బామ్మ అని ఇంకొందరు- ఇలా రకరకాల వరసలతో పలకరించేవారు. ఇండ్లలో మగవాళ్లు ఉన్నప్పుడు హిందూ స్త్రీలు లోపలికి వచ్చేవారు కారు. హిందువులు సాధారణంగా తమ వంటకాలను కానుకల రూపేణా తెచ్చి ఇచ్చేవారు. పచ్చళ్లు మొదలుకుని అప్పడాల వరకు అనేక రకాల వంటకాలు కానుకల రూపంలో ముస్లింల ఇండ్లకు వచ్చేవి. పండుగల సందర్భాలలో హిందూ ముస్లిం పురుషులు కూడా స్నేహ సూచకంగా కానుకలను ఇచ్చిపుచ్చుకునేవారు. హిందువుల ఇంట జరిగే వివాహాది శుభ సందర్భాలలో సగం మంది హిందువులుంటే సగం మంది ముస్లిములుండేవారు. అలాగే ముస్లిము ఇంట జరిగే వివాహాది శుభకార్యాలకు హిందువులు హాజరయ్యేవారు. ఇరువురూ ఒండొకరిని మనస్ఫూర్తిగా ఆహ్వానించేవారు. ఒండొకరిని ఆదరించేవారు. (1857కు ముందున్న సామాజిక స్థితి- నజీబాబాద్‌కు చెందిన అయూబ్ ఖాన్ కథనం)

# 36. మత స్వాతంత్ర్యం

ముహమ్మద్ బిన్ ఖాసిమ్ సింధు ప్రాంతాన్ని అప్రతిహతంగా జయించుకుంటూ బ్రాహ్మణాబాద్ వరకూ వచ్చేశాడు. బ్రాహ్మణాబాద్ అతని వశమైపోయిన తరువాత కొంత మంది పూజారుల బృందం ఆ నూనూగు

మీసాల కమాండర్ వద్దకు వచ్చి ఇలా విన్నవించుకుంది: "ఓ ముహమ్మద్ బిన్ ఖాసిమ్! ముస్లిం సేనల భయంతో దేవాలయాలకు వచ్చే హిందువుల సంఖ్య క్షీణించింది. తత్కారణంగా మా ఆదాయం కూడా తగ్గిపోయింది. మందిరాల మరమ్మత్తు పనులు కూడా ఆగిపోయాయి. అదీగాక యుద్ధాలు, ముట్టడుల సమయాల్లో మా దేవాలయాలు కూడా పాక్షికంగా దెబ్బతిన్నాయి. కనుక నీవు నీ బాధ్యతతో దేవాలయాలకు మరమ్మత్తులు చేయించు. హిందువులు తమ దేవాలయాలకు వచ్చి మరీ పూజలు చేసేలా ఒత్తిడి తీసుకురా. నీవు రైతులపై, వర్తకులపై, వృత్తికారులపై ఎన్నో వరాల వర్షం కురిపించావు. మేము దేవాల యాలకు సంరక్షకులము. నీ వరాలకు మేము మాత్రం ఎందుకు దూరమవ్వాలి?" అని చెప్పుకున్నారు.

'దేవాలయాల నిర్వహణా బాధ్యత మాది కాదు కదా!' అన్నాడు ముహమ్మద్ బిన్ ఖాసిమ్. 'దేవాలయాల మంచీ చెడులను చూసే బాధ్యత మీది. ఇప్పుడు మేము నీ పాలనలోకి వచ్చేశాము. నువ్వు మత స్వాతంత్ర్యం గురించి ప్రకటించావు. కాబట్టి మా ఆరాధనా స్థలాలకు మరమ్మత్తులు చేయించి, మా ఆదాయాన్ని పెంచవలసిన బాధ్యత కూడా నీ పైనే ఉంది' అని పూజారులు నొక్కి చెప్పారు.

ముహమ్మద్ బిన్ ఖాసిమ్ ఈ విషయమై ఒక నిర్ణయానికి రాలేకపోయాడు. తక్షణం హజ్జాజ్ బిన్ యూసుఫ్ దగ్గరకు ఒక దూతను పంపించి బ్రాహ్మణుల కోరికపై సలహా కోరాడు. దీనికి సమాధానంగా హజ్జాజ్ ఇలా వ్రాశాడు-

"బ్రాహ్మణాబాద్‌కు చెందిన హిందువులు తమ మందిర కట్టడాలను మరమ్మత్తు చేయించుకోగోర్తున్నారని నీ ఉత్తరాన్ని బట్టి అర్థమవుతోంది. వాళ్లు నీకు విధేయులై ఉండటానికి అంగీకరించినందున ఇప్పుడు వారికి వారి ఆరాధ్య దైవాలను కొలిచే స్వేచ్ఛ నొసగాల్సిందే. ఎవరిపైనా ఎలాంటి బలాత్కారానికి తావుండకూడదు."

ఈ ఉత్తరం అందేసరికి ముహమ్మద్ బిన్ ఖాసిమ్ బ్రాహ్మణాబాద్‌ను దాటి లోహానా చేరుకున్నాడు. ఈ ఉత్తరం చదివి అతను బ్రాహ్మణాబాద్‌కు

తిరిగివచ్చాడు. స్థానిక ప్రముఖులందరినీ సమావేశపరచి, అప్పటి వరకూ పూజారులకు గల హక్కులను గురించి దర్యాప్తు జరిపాడు. దాహెర్ రాజు కాలంలో ప్రభుత్వం తరపున వారికి లభించే రాయితీలను గురించి ఆరాతీశాడు. ఆ తరువాత ముహమ్మద్ బిన్ ఖాసిమ్ నగరంలో ప్రకటన గావిస్తూ, తమ తాతముత్తాతల మతాచారాలను పాటించదలిచే వారిపై ఎలాంటి ఆంక్షలు ఉండబోవనీ, వారు నిరభ్యంతరంగా తమ మతధర్మాన్ని అవలంబించవచ్చుననీ తెలిపాడు. ఈనాటి వరకు బ్రాహ్మణులకు ఏ విధంగా దానధర్మాలు చేసేవారో, ఎలా దక్షిణ సమర్పించుకునేవారో అదే విధంగా వాటిని కొనసాగించాలని కూడా ఆ ప్రకటనలో పేర్కొన్నాడు. ప్రభుత్వానికి రెవిన్యూ ద్వారా లభించే ఆదాయం లోంచి మూడు శాతం సొమ్ము బ్రాహ్మణుల కోసం కేటాయించబడుతుందనీ, ఆ మొత్తాన్ని బ్రాహ్మణులు తాము తలచినప్పుడల్లా తీసుకుని మత వ్యవహారాలకై వెచ్చించవచ్చని కూడా తెలియజేశాడు. ఆ తర్వాత అతను బ్రాహ్మణులలో అందరికన్నా పెద్దపండితునికి 'రాణా' అనే బిరుదునిచ్చి అతన్ని మత వ్యవహారాల అధికారిగా నియమించాడు.

ముహమ్మద్ బిన్ ఖాసిమ్ విజ్ఞతను, సమయస్ఫూర్తిని తెలుసుకుని హజ్జాజ్ అతనికి శుభాకాంక్షల్ని తెలియజేశాడు- ప్రశంసాపూర్వకమైన ఉత్తరం వ్రాస్తూ ఇలా అన్నాడు, "నీకూ- నాకూ మధ్య ఉన్న దూరం వల్ల సమస్యల పరిష్కారం కోసం ఉత్తరప్రత్యుత్తరాలపై ఆధారపడటం ఇకమీదట సమంజసం కాదు. దీనివల్ల కార్యనిర్వహణలో ఆటంకాలు ఎదురవుతాయి. కాబట్టి ఇక నుంచి నీవు స్వయంగా పరిపాలనా వ్యవహారాలలో, న్యాయవ్యవహారాలలో అంతిమ నిర్ణయం తీసుకో."

ముహమ్మద్ బిన్ ఖాసిమ్ సాధించిన మరో విజయం గురించి తెలుసుకుని హజ్జాజ్ ఇలా వ్రాసి పంపాడు: "నీ పట్ల వైర వైఖరిని అవలంబించిన వారిని నీ దారి నుంచి తొలగించు. నీకు విధేయులై ఉండేవారికి రక్షణ కల్పించు. ఇస్లాం స్వీకరించినవారి వ్యవసాయోత్పత్తుల నుండి ఉష్ర్ (10వ వంతు)ను వసూలు చెయ్యి. తమ తమ మతాచారాలకు కట్టుబడి ఉండేవారి నుండి పన్ను వసూలు చేయదలచినపుడు; వారంతకు ముందు తమ

రాజులకు ఎంత భాగం పన్ను ఇచ్చేవారో దర్యాప్తు జరిపి అంత భాగాన్నే వసూలు చెయ్యి." ('ఆయినయే హఖీఖత్‌నుమా' మొదటి సంపుటి- పేజీ:98)

## 37. దెబ్బకు దెబ్బ

జౌన్‌పూర్‌కు చెందిన ఒక బ్రాహ్మణ కన్యను అక్కడి రెవిన్యూ అధికారి బలవంతంగా నికాహ్ (వివాహం) చేసుకోవాలనుకున్నాడు. ఆ యువతి తండ్రికి ఇది సుతరామూ ఇష్టం లేదు. ఏమాత్రం తాత్సారం చేయక అతడు ఔరంగజేబు దర్బారుకు బయలుదేరాడు. దర్బారులో చక్రవర్తికి తు.చ. తప్పకుండా- అంతా వివరించాడు. చక్రవర్తి వెంటనే రెండు స్వారీలను తెప్పించి, ఒకదానిపై తాను కూర్చున్నాడు. మరో వాహనంపై బ్రాహ్మణుడినీ, తన సలహాదారును కూర్చోబెట్టి జౌన్‌పూర్‌కు సాగిపోయాడు. అకస్మాత్తుగా పాదుషా అక్కడికి రావటంతో ఆ రెవిన్యూ అధికారి గుండె పగిలిపోయింది. విచారణ జరిపించగా బ్రాహ్మణుడు చెప్పినదంతా నిజమని తేలింది. రెవిన్యూ అధికారి శిక్షించబడ్డాడు. చక్రవర్తి ఆ బాధిత బ్రాహ్మణునికి ఇనాములు ఇచ్చాడు. కొంత నగదును కూడా ఇచ్చాడు. ఆ తర్వాత ఆ బ్రాహ్మణుడు తనకు నచ్చిన అబ్బాయికిచ్చి కూతురి వివాహం జరిపించాడు. ('తారీఖ్‌కా రోషన్ పహలూ' పేజీ : 20)

## 38. ఖడ్గపు అంచుపై....

"తబఖాతె అక్బరి" అనే ప్రఖ్యాత చరిత్ర పుస్తకం అక్బర్ పరిపాలనా కాలంలోనే వ్రాయబడింది. అందులో సికందర్ లోధి రాకుమారుడిగా ఉన్న కాలంలో జరిగిన సంఘటన ఒకటి వ్రాయబడింది. స్థానేశ్వరంలో ఒక చెరువు ఉంది. దాన్ని అచటి హిందువులు పవిత్రమైనదిగా భావించేవారు. అందులో స్నానమాచరిస్తే పవిత్రత చేకూరుతుందని కూడా వారు విశ్వసించేవారు. ఆ చెరువు గట్టుపైనే ఓ పూజామందిరం కూడా ఉంది. ఆ మందిరాన్ని పడగొట్టడానికి సికందర్ లోధి ముస్లిం ధర్మవేత్తల్ని "ఫత్వా" (ధార్మిక తీర్పు) కోరాడు. అప్పుడు ఆ ధర్మవేత్తలు ఇచ్చిన సమాధానం చరిత్రాత్మకమయినది:

"హిందువుల ప్రాచీన పూజా మందిరాన్ని మీరు పడగొట్టలేరు, ఆ తటాకంలో హిందువుల పవిత్ర స్నానాచరణని కూడా ఆపలేరు." ఇది విన్నంతనే రాకుమారుని చేయి కరవాలంపై బిగుసుకుంది. "మీరంతా ధర్మ తిరస్కారుల్ని బలపరుస్తున్నారా?" అని కోపోద్రిక్తుడై అన్నాడు. అప్పుడు అక్కడే ఉన్న అబ్దుల్లా అనే గొప్ప ధర్మవేత్త సభికులందర్నీ ఉపదేశిస్తూ, "మేము తిరస్కారులను కాదు సత్యాన్ని బలపరుస్తున్నాము. ఇస్లాం మాకు నేర్పిన దాన్నే ప్రకటిస్తున్నాము. ఇస్లాం మమ్మల్ని బోధనల ప్రచారం నుండి, సత్యప్రకటన నుండి ఏ శక్తి అడ్డుకోజాలద"ని ధైర్యంగా ప్రకటించాడు. ఇది విన్న సికందర్ లోధి నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. తన తప్పును అంగీకరించాడు. -తబఖాతె అక్బరీ

## 39. అంటరానితనానికి అతీతంగా ప్రజాసేవ

భారతదేశాన్ని పరిపాలించిన ఓ చక్రవర్తి బాబర్. అతడు భారతదేశంలో ఒకానొక ప్రాంతపు రాజును ఓడించి ఆ ప్రాంతాన్ని తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు. తన తండ్రికి జరిగిన పరాభవానికిగాను ప్రతీకారం తీర్చుకోవడానికి ఆ రాజు గారి కొడుకు బయలుదేరాడు. రాజమహలు చుట్టుప్రక్కల్లో తిరు గుతూ బాబర్ పనిపట్టాలని అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు.

అంతలోనే రాజమహలు ఆవరణలో కలకలం రేగింది. ప్రజలు అటూ ఇటూ పరుగులు తీస్తున్నారు. అసలేం జరిగిందంటే మదపుటేనుగు ఒకటి త్రాడు తెంచుకుని వచ్చి స్వైరవిహారం చేస్తోంది. రాజకుమారుడు పొంచివున్న చోటికి దగ్గరలోనే పాకీ పని చేసే ఒక మహిళ ఊడుస్తున్నది. పాలుత్రాగే పసిబిడ్డను గుండెలకు హత్తుకుని ఉంది. అయితే ఆ ఏనుగు కూడా ఆమె వైపునకే దూసుకువస్తోంది. పసికందు తన చేతుల నుండి ఎక్కడ జారి క్రిందపడుతుందోనన్న ఆందోళన ఆ మహిళలో చోటుచేసుకుంది. 'అయ్యో! నా చిట్టితండ్రిని కాపాడే వారెవరూ లేరా?' అని కేకవేసిందామె. ఎవరి ప్రాణం వారికి తీపి. ఇంక ఆ పిల్లవాడిని రక్షించే ఆలోచన ఎవరికి?

రాజకుమారుడు దగ్గరి నుండి ఇదంతా గమనిస్తూనే ఉన్నాడు. ఆ పాకీ పనిచేసే మహిళ పసికందును కాపాడటానికి అతను కాస్తముందుకు వచ్చాడు.

ఆమెలో ఆశలు చిగురించాయి. కాని అంతలోనే అతను ఆగిపోయాడు. బహుశా ఆమె అంటరానిదన్న ఆలోచన అతని కాళ్ళను కట్టిపడేసి ఉంటుంది. ఆ మదపుటేనుగు ఆమె వైపునకే దూసుకువస్తోంది. ఆమెకీ-ఏనుగుకీ మధ్య కొన్ని అడుగుల అంతరం మాత్రమే. అంతలోనే అద్భుతం! మహలుపై నుంచి ఒక వీరయోధుడు ఈటెతో ఒక్క ఉదుటున క్రిందికురికాడు- దివి నుంచి భువికి దిగివచ్చిన దివ్య దూతలా! ఏనుగు నుదుటిపై ఈటెతో రెండు సార్లు గుచ్చేసరికి దాని మదం అణగింది. ఆ వీర యోధుడు మెరుపువేగంతో ఆ మహిళ ఒడిలోని పిల్లవాడిని లాగేసుకుని మహలు లోపలకు వెళ్ళిపోయాడు.

ఆ యోధుడు ఎవరో కాదు, స్వయంగా బాబర్ చక్రవర్తే. ఈ దృశ్యమంతటినీ తదేకంగా తిలకించిన రాజకుమారుని తల తిరిగిపోయింది. ఇప్పటి వరకూ చక్రవర్తి గురించి ఆలోచించిందేమిటి? తానిప్పుడు ఇక్కడ చూస్తున్నదేమిటీ?! వెంటనే దర్బారు లోపలికెళ్ళి చక్రవర్తి కాళ్ల దగ్గర తన ఖడ్గాన్ని పెట్టేశాడు. 'తమరే ఈ ఖడ్గంతో ఈ పాపాత్ముడి కథను కంచికి చేర్చండి' అన్నాడు. ఇతననేదేమిటో బాబర్‌కి అంతుబట్టలేదు. "సోదరా? నువ్వనేదేమిటీ? అసలు నువ్వెవరవు? ఇక్కడికెందుకొచ్చావ్?" ఆరా తీశాడు బాబర్.

రాజకుమారుడు తనను పరిచయం చేసుకుని జరిగినదంతా వివరించాడు. తమరిని చంపడానికి వచ్చాను. కాని తమయందున్న మానవత్వాన్ని, ప్రజా సంక్షేమ భావనను చూసి నా కళ్లు తెరచుకున్నాయి. ఒక పారిశుధ్య పనిచేసే స్త్రీ బిడ్డను కాపాడటానికి తన ప్రాణాలనే పణంగా పెట్టిన 'మారాజు'ను, మానవతా మూర్తిని వధించటం దారుణం కాదా! అని నా అంతరాత్మ ఘోషించింది. మరి ఆ సమయంలో నేను ఆ మహిళకు దగ్గరలోనే ఉన్నాను. కాని ఆ తల్లీ బిడ్డలను ఆదుకోవడానికి నాలోని అభిజాత్యం అడ్డొచ్చింది. నా రాజ్యం, నా అధికారం అంతా అయిపోయింది. నేను బ్రతికి ఇక ఏ లాభమూ లేదు కూడా. కాబట్టి నన్నిక కడతేర్చండి- అని చెప్పుకుపోతున్నాడు రాకుమారుడు.

బాబర్ ఆ రాకుమారుణ్ణి తన హృదయానికి హత్తుకున్నాడు.

"నేను నీ రాజ్యాన్ని నీకు తిరిగి ఇచ్చేస్తున్నాను. నీ రాజ్య ప్రజల బాగోగుల్ని చూసుకో. నా మాదిరిగానే నువ్వు కూడా ఇక మీదట - అంటరాని తనానికి అతీతంగా ప్రజాసేవ చేస్తూ ఉండు" అని బాబర్ అతన్ని ఓదార్చి, ఉపదేశించి పంపాడు.

## 40. ఒక విశేష వార్త

1954 మే 7వ తేదీన 'సిద్ఖె జదీద్' పత్రికలో వచ్చిన వార్త-

లాహోర్ : ఏప్రిల్ 30: క్రీ.శ. 1947లో జరిగిన అలజడుల సందర్భంగా కిడ్నాప్ చేయబడిన హైందవ బాలిక, సీత ఇటీవల భారతదేశంలోని తన తల్లిదండ్రుల వద్దకు సురక్షితంగా పంపబడిందని తెలియవచ్చింది. ఆమెను దత్తత తీసుకున్న ఆమె తండ్రి పాకిస్తాన్ దేశస్థుడు అయిన కల్నల్ ముహమ్మద్ అక్బర్ ఖాన్ త్వరలో భారత దేశానికి వచ్చి ఆ యువతి వివాహ మహోత్సవానికి హాజరుకానున్నాడు. ఆ యువతి ఇదే జిల్లా (లాహోర్) కు చెందిన లాలా మణిరామ్ కూతురు. 11 ఏళ్ల వయస్సులో ఆమె కిడ్నాప్ చేయబడింది. ఈ సంగతి తెలుసుకున్న కల్నల్ సాబ్ తన పలుకుబడిని ఉపయోగించి దుండగుల చెర నుండి ఆమెను విడిపించారు. కన్న కూతురిలా ఆమెను తన ఇంట్లో ఉంచారు. ఈలోగా ఆమె కన్నవాళ్లను అన్వేషించటానికి తీవ్రంగా కృషి చేశారు. వాళ్ళ అన్వేషణ ఎట్టకేలకు ఫలించింది. ఆ అమ్మాయిని సగౌరవంగా ఆమె తల్లిదండ్రుల వద్దకు చేర్చారు. (సిద్ఖె జదీద్-7.5.1954)

## 41. పవిత్ర స్థలాల రక్షణ

మూడవ మైసూరు యుద్ధ సమయాన ఆంగ్లేయులు, నిజాం సేనలు, మహారాష్ట్రులు టిప్పుసుల్తాన్ రాజ్య పరిధిలో ఉన్న పట్టణాలపై దండెత్తి ధ్వంసం చేయసాగారు. మహారాష్ట్రులు దోపిడి విధ్వంసకాండలో మరింత ముందంజ వేశారు. చివరకు హిందువుల పవిత్ర స్థలమైన శ్రీనగర్‌ను కూడా వదిలి పెట్టలేదు. దేవాలయ గురువు సుల్తాన్‌కు లేఖ వ్రాస్తూ, "మహారాష్ట్ర

సైన్యం శ్రీనగర్ దేవాలయాన్ని నేలమట్టం చేసింది. శారదా దేవి విగ్రహాన్ని పెకిలించి వేరే చోట పారేశారు. దేవాలయానికి జరిగిన మొత్తం నష్టం 60 లక్షల రూపాయల వరకు ఉంటుంది. దేవాలయానికి సంబంధించిన ఏనుగులు, గుర్రాలను కూడా మహారాష్ట్రులు తోలుకుపోయారు" అని వివరించాడు.

ఈ ఉత్తరానికి 1791లో సమాధానమిస్తూ మైసూర్ సుల్తాన్ ఇలా వ్రాశాడు:

"మన దేశానికి వచ్చి మన ప్రజలపైనే దండెత్తి మారణకాండ సృష్టిస్తున్న వారిని మేము శిక్షించే ప్రయత్నంలో ఉన్నాము. దాని కోసం మీరు కూడా ప్రార్థించండి. మన దేశ రక్షణ కోసం, మన ప్రజల యోగక్షేమాల కోసం కూడా మీబోటి వారు ప్రార్థించాలి."

ఈ లేఖను పురస్కరించుకొని దేవాలయ గురువు సుల్తాన్‌కు మరో లేఖ వ్రాశారు: అందులో ఆయన ఇలా పేర్కొన్నారు: "మేము మహారాష్ట్రుల దౌర్జన్యాన్ని తాళలేక వేరే చోటకు వెళ్ళి నివసిస్తున్నాము. మేము మీ సహకారం లేకుండా శారదాదేవి విగ్రహాన్ని పునఃప్రతిష్టించే స్థితిలో కూడా లేము."

సుల్తాన్ ఈ ఉత్తరం చదివి ఇలా సమాధానం రాశాడు: "పవిత్ర స్థలాలను అగౌరవపరిచే ఈ ప్రజలు అనతి కాలంలోనే తాము చేసిన చేష్టలకు పర్యవసానం అనుభవించకపోరు. చెడు పని చేస్తూ ఆనందిస్తున్న ఈ అవివేకులు రేపు వాటి పర్యవసానాలను ఏడుస్తూ అనుభవిస్తారు."

దీనితోపాటు సుల్తాన్ పట్టణాధికారికి ఒక అజ్ఞాపత్రం జారీ చేస్తూ, గురూజీకి నగదు సహాయంగా 200 రాహితలు (సవరల బంగారం) అంతే ఖరీదు చేసే ధాన్యం అందజేయమని కోరాడు. అదే పత్రంలో గురూజీ పేర ఇలా రాశాడు:

"పల్లె ప్రాంతాల నుండి మీకు అవసరమయిన వాటిని సమకూర్చుకునే అధికారం ఇందుమూలంగా ఇస్తున్నాను. ఈ డబ్బుతో మీరు శారదాదేవి విగ్రహాన్ని పునఃప్రతిష్టించుకోండి. ఆహార ధాన్యాల ద్వారా బ్రాహ్మణులకు భోజన ఏర్పాట్లు చేయండి." -మైసూరు పాలకుల చరిత్ర

# 42. ఇది పరమత ద్వేషమా?

ఒకసారి ఒక ముస్లిం ఉద్యోగి ఔరంగజేబు చక్రవర్తికి ఈ విధంగా ఉత్తరం వ్రాశాడు-

"తమరు తమ దర్బారులోని ఫలానా విభాగంలో ఫలానా విగ్రహారాధకులను కీలకమైన పదవిలో నియమించారు. బహుశా ఆ పదవికై యోగ్యుడైన ముస్లిం ఉద్యోగి మీకు దొరకలేదేమో! నాకిద్దరు కొడుకులు. వారిరువురూ చిన్న హోదాలపై పనిచేస్తున్నారు. వారిద్దరూ మీకు నమ్మినబంట్లు కూడాను. కాబట్టి ఆ ఇద్దరు ముస్లిమేతరుల్ని తొలిగించి నా కుమారులను ఆ హోదాలలో నియమించవలసిందిగా అర్థిస్తున్నాను."

అర్జీ పెట్టుకున్న వ్యక్తి తన వాదన దృఢతరంగా ఉండాలన్న ఉద్దేశ్యంతో, ఖుర్‌ఆన్‌లోని ఓ వాక్యాన్ని కూడా ఉదాహరించాడు. ఆ వాక్యం- కొన్ని ప్రత్యేక పరిస్థితులకు మాత్రమే వర్తిస్తుంది. దీనికి ఔరంగజేబు ఎంతో స్పష్టంగా, మరెంతో సూటిగా సమాధానం వ్రాశాడు. ఆయన ఇలా బదులిచ్చాడు:

"కీలకమైన పదవులలో ఇద్దరు ముస్లిమేతరులు ఉన్నారన్న సంగతి నాకు తెలుసు. దీని అర్థం ముస్లిములలో అంతటి యోగ్యులెవరూ లేరన్నది ఎంతమాత్రం కాదు. ఉద్యోగ నియామకాలు చేసేటప్పుడు ముస్లిం పాదుషా ప్రజల మధ్య మత వివక్ష చూపరాదన్నదే నా అభిమతం. కనుక మీ అభ్యర్థన అంగీకరించ వీలులేదు."

ఆ ఉత్తరంలో ఔరంగజేబు ఇంకా ఇలా వ్రాశాడు:

"దరఖాస్తుదారుడు తన వాదనకు అనుగుణంగా ఉదాహరించిన దివ్యఖుర్‌ఆన్ వాక్యం సందర్భోచితం కాదు. ఆ వాక్యాన్ని అర్థం చేసుకోవటంలో దరఖాస్తుదారుడు పొరబడ్డాడు." దీనికి విరుగుడుగా ఔరంగజేబు మరో వాక్యాన్ని ఉదాహరించాడు. దాని సారాంశం ఇది: "మీరు న్యాయం చేయండి- మీరు చేసే న్యాయం, మీరు ఇచ్చే సాక్ష్యం మీ స్వయానికి, మీ బంధుమిత్రులకు వ్యతిరేకంగా పరిణమించినా సరే!" (రుఖ్‌అతె ఆలమ్‌గీర్)

## 43. విచక్షణకు తావులేదు

హైదరాబాదులో ఆర్య సమాజ్‌వారి డిమాండ్లను దృష్టిలో పెట్టుకుని నిజాం ప్రభుత్వం జారీ చేసిన ఒక ఫర్మానాలో ఇలా పేర్కొనబడింది-

"ఇక్కడ గమనార్హమైన విషయం ఒకటుంది. దాన్ని ఇక్కడ పునరుక్తం చెయ్యడంలో తప్పులేదు. ఈ నిబంధనల (మతాచారాల నిర్వహణతో ముడిపడి వున్న విషయాల గురించి అనుమతి పొందే నిబంధనల) వర్తింపులో హిందూ-ముస్లిం అన్న విచక్షణ గానీ, లేదా వేరొక మతస్థుడన్న వివక్ష గానీ సుతరామూ చూపబడదు. ఇటీవల వరంగల్లులో జరిగిన సంఘటన ద్వారా కూడా ఈ సంగతి స్పష్టపరచబడింది. అక్కడ గణేశ్ నిమజ్జనోత్సవం సందర్భంగా ఊరేగింపును ఒక ముస్లిం మహనీయుని సమాధి ప్రక్క నుంచి సాగిపోయేందుకు అనుమతి ఇవ్వబడింది. దీనిపై స్థానిక ముస్లింలు తీవ్రంగా నిరసన తెలిపినప్పటికీ, వారి వాదనలో పస లేకపోవటం మూలంగా వారి ఆక్షేపణను మేము లక్ష్య పెట్టలేదు." (హైదరాబాదులో ఆర్య సమాజ ఉద్యమం- ఆసఫియా ప్రభుత్వం తరపున వెలువరించబడిన పుస్తకం-పేజీ: 57)

## 44. దటీజ్ జడ్జిమెంట్

ఒకనాడు షేర్‌షాహ్ కుమారుడయిన యువరాజు ఆదిల్ ఖాన్ ఏనుగుపై కూర్చుని 'ఆగ్రా'లోని ఓ సందుగుండా ప్రయాణమవుతున్నాడు. ఆ సందులో వైశ్య స్త్రీ ఒకామె తన ఇంటి ఆవరణలో స్నానం చేస్తున్నది. గోడలు పొట్టిగా ఉన్నాయి. యువరాజు దృష్టి ఆ స్త్రీపై పడింది. యువరాజు గమ్మున పోయాడా? లేదు. పోతూ పోతూ తన చేతిలో ఉన్న తాంబూలం ఆ స్త్రీపై విసిరిపోయాడు. సౌశీల్యవతి అయిన ఆ స్త్రీ సిగ్గుతో, అవమానంతో క్రుంగిపోయింది. ఇక బ్రతకడమే వ్యర్థమనుకుంది. అంతలో ఆమె భర్త ఇంటికి వచ్చాడు. ఆత్మహత్యకు పాల్పడుతున్న భార్యను అడ్డుకుని అసలు సంగతి తెలుసుకున్నాడు. భార్యను ఓదార్చి ఆమె నిర్ణయాన్ని మాన్పించాడు. యువరాజు విసిరిన ఆ తాంబూలాన్ని పుచ్చుకొని తిన్నగా షేర్‌షాహ్ దర్బారుకు వెళ్ళాడు. జరిగిందంతా పూసగుచ్చినట్లు విన్నవించుకున్నాడు.

ఈ ఫిర్యాదును విన్న చక్రవర్తి ముఖకవళికలు మారిపోయాయి. భృకుటి ముడిపడింది. కొడుకు చేసిన నీతిమాలిన చేష్టకు ఆగ్రహాన్ని దిగమ్రింగుతూ దర్యాప్తు జరిపించాడు. యువరాజు చేసిన నేరం రుజువయ్యింది. చక్రవర్తి కొలువు తీరాడు. మంత్రులు, అధికారులు నిశ్శబ్దంగా కూర్చొని ఉన్నారు. దర్బారు వాతావరణం ఎంతో గంభీరంగా తయారయ్యింది. చక్రవర్తి తీర్పు ఎలా ఉంటుందోనన్న ఉత్కంఠత, భయం దర్బారు వాసుల్లో నెలకొంది. గొంతు సవరించుకుని తీర్పు వినిపించటం ప్రారంభించాడు షేర్‌షాహ్:

"ఈ వైశ్య సోదరుణ్ణి ఏనుగుపై కూర్చోబెట్టండి. ఇతని భార్య స్థితిలోనే యువరాజు ఆదిల్‌ఖాన్ భార్యను సవారి అవుతున్న వైశ్యునికి ఎదురయ్యేటట్లు చేయండి. అదే విధంగా ఈ యువకుడు తాంబూలం ఆదిల్ ఖాన్ భార్యపై విసురుతాడు."

తీర్పు వినగానే దర్బారులో పిడుగుపడ్డట్టయ్యింది. మంత్రులు, కార్యనిర్వాహకులు చక్రవర్తికి నచ్చజెప్పడానికి ప్రయత్నించారు- తీర్పును వాపసు తీసుకోవాలని. కాని చక్రవర్తి ససేమిరా అన్నాడు. చక్రవర్తి తీర్పుకు వైశ్య సోదరుడు కరిగిపోయాడు. యువరాజుకు తన తరఫున క్షమాభిక్ష పెడతున్నానని అతను వ్రాతపూర్వకంగా రాసి ఇవ్వడంతో గత్యంతరంలేక చక్రవర్తి మౌనం వహించవలసి వచ్చింది. (తారిఖె హింద్- జికాఉల్లాహ్)

## 45. విధి నిర్వహణ

ఒక రోజు ఆదిల్‌షాహ్ బీజాపూర్‌లో తన మహలు పైకెక్కి పరిసరాలను తిలకిస్తున్నాడు. సాయం సమయమది. ఎటు చూసినా ఇళ్లలో నుండి పొగలు వస్తున్నట్లు కానవచ్చిందతనికి. అదే సందర్భంలో పాదుషా దృష్టి బహమన్‌పల్లి అనే పేటపై పడింది. అది హిందువులు నివసించే ప్రదేశం. ఆశ్చర్యకరమయిన విషయం ఏమంటే ఆ పేటలో ఏ ఒక్క ఇంటి నుండి కూడా పొగ వస్తున్నట్లు పాదుషాకు కనబడలేదు. ఆ వీధిలో ఎవరూ వంట చేస్తున్నట్టు అగుపించదేమి? అని విచారించాడు పాదుషా దర్బారు వారితో. ఈ వీధిలో ఉండే వారంతా బ్రాహ్మణులు. వారు రోజూ ఒక పూట, కేవలం మధ్యాహ్నం పూట మాత్రమే భోజనం చేస్తారు అని జవాబిచ్చారు దర్బారువాసులు. దానికి కారణం బీదరికమే అయి ఉంటుందని తలపోశాడు పాదుషా. ఆ వీధి వారికోసం ప్రభుత్వం

తరపున పింఛన్లు ఇవ్వమని తక్షణం ఆజ్ఞాపించాడు. వెంటనే సదరు బ్రాహ్మణులకు పింఛన్ జారీ చేయబడింది. ఇంతకీ ఆ బ్రాహ్మణులు సాయంత్రం వంట చేయనిది బీదరికం వల్లకాదు, తమ నియమాల ప్రకారం వారు ఆ సమయాన వంట చేయరని రాజ సదస్యులకు తెలుసు. అయితే ఒక మంచి పనిలో అవరోధం అవుతామేమో అన్న ఉద్దేశ్యంతో వారు ఈ విషయాన్ని దాచి పెట్టారు. రాజుల వారికి చెప్పలేదు.

-దక్కన్ చరిత్ర నుండి

## 46. పవిత్ర స్థలాల పట్ల మర్యాద

బీజాపూర్ రాజ్యాధికారి ఆదిల్ షా హయాంలో మస్జిదుల లంగరు నుంచి ముస్లింలకు వండిన భోజనం సమకూర్చబడినట్లే హిందూ అగత్యపరులకు వండని ఆహారం సరఫరా చెయ్యబడేది. ప్రతి ఒక్కరికీ క్రిందపేర్కొనబడిన ఆహారధాన్యాలు ఇవ్వబడేవి:

గోధుమలు, బియ్యం, పప్పుదినుసులు, నెయ్యి, ఇంకా వంట చెరుకు కొనే నిమిత్తం కొంత నగదు.

మస్జిదులలో ముస్లింల కోసం త్రాగే నీటి సరఫరా ఏర్పాట్లున్నట్లే వాటి సమీపంలో హిందువుల కోసం కూడా నీటి సరఫరా సౌకర్యం కల్పించబడేది. అక్కడ ఒక బ్రాహ్మణుడు ఫక్తు నీరు త్రాగించేందుకు నియమించబడేవాడు.

(తారీఖె దకన్)

## 47. ఐక్యతలోనే ఆనందం

విదేశీ పాలన నుండి దేశాన్ని విముక్తం చేయడానికి ముస్లిములు వేనవేల మంది జాతీయోద్యమాలలో పాల్గొన్న సంఘటనలు చరిత్రలో మనకు అసంఖ్యాకంగా లభిస్తాయి. ఉదాహరణకు ఒక సంఘటనను తీసుకుందాం. అది మార్చి 20-21 మధ్య 'వాదా'లో జరిగింది. గూర్ఖా రిజమెంటు హిందూ ముస్లింలు కలసి ఉన్న ఒక సమూహంపై కాల్పులు జరిపింది. ఫలితంగా ఆ కాల్పుల్లో ఎంతో మంది హిందువులూ ముస్లింలు చనిపోయారు. ఆ మృత వీరుల అంత్యక్రియల్లో హిందూ ముస్లిం అనే తేడా లేకుండా అసంఖ్యాకంగా

జనులు పాల్గొన్నారు. ఆ సంస్కారంలో సృష్టిలోని మనుషులంతా కదలివచ్చారా అన్నట్లుంటుంది.

నిజానికి ఆ సమూహంలో హిందువులు అధిక సంఖ్యలో ఉన్నారు. బ్రిటిష్ వారి సాయుధ పటాలాలు, వాహనాలు వెనుక వస్తున్నాయి. జాతీయోద్యమ నినాదాలతో మృతవీరుల అంత్యక్రియలు జరపడానికి ముందుకు సాగుతున్నది ఆ ఊరేగింపు. హిందూ మృతవీరుల దహన సంస్కారం కోసం పాడెలు ఎత్తగా ముస్లింలు ఎంతో ఉత్సాహంతో పోటీపడి పాల్గొన్నారు. అయితే దీనికి రెట్టింపైన ఉత్సాహంతో హిందూ సోదరులు ముస్లిం మృత వీరుల ఖనన సంస్కారంలో పాల్గొన్నారు. ముస్లింల కంటే ముందు హిందువులే జనాజాలను తమ భుజాలపై ఎత్తుకొని పోతూ ఉంటే హిందువుల పాడెలు ముస్లిములు ఎత్తి ముందుకు సాగారు. ముస్లింల అంతిమ సంస్కారంలో పాల్గొన్న వారిలో శ్రీస్వామి శ్రద్ధానంద కూడా ఉన్నారు.

స్వయంగా స్వామీజీ "నేను ఈ ముస్లిం మృతవీరుల అంత్యక్రియల్లో హృదయపూర్వకంగా పాల్గొన్నాను. జనాజాల (శవపేటికల) భుజం మార్చుకునే సందర్భంలో హకీం అజ్మల్ ఖాన్, నేనూ కాళ్ళ వైపున కలిశాము. అప్పటి నుండి మేమిరువురం నిజమయిన సహోదరులుగా కలసి పని చేసేవాళ్ళం" అని అన్నారు.

-బిషప్ ఎ.కె. సుబ్‌హాన్, ఆసియా చర్చీల సంఘం అధ్యక్షులు,17 సెప్టెంబర్, 1962

## 48. మస్జిద్ కోసం

మైసూరు రాజు టిప్పు సుల్తాన్ పేరును చరిత్ర విద్యార్థులు ఎవరూ మరువలేరు. అతను చిన్ననాటి నుంచి పెరిగిన చోట ఒక మస్జిద్, 'మస్జిదే ఆలా' పేరుతో కానవస్తుంది. అంతకు ముందు అక్కడ ఒక చిన్న దేవాలయం, ధర్మసత్రం ఉండేవి. ఒక ఫకీరు టిప్పు సుల్తాన్ పెద్దవాడయి మహా యోధుడవు తాడని భవిష్యవాణి చెప్పాడట. పెద్దవాడయిన తరువాత ఆ స్థలంలో మస్జిద్ కట్టాలని టిప్పు సుల్తాన్ ఇష్టపడ్డాడు. అయితే అక్కడొక దేవాలయం ఉండటం మూలంగా సుల్తాన్ తన నిర్ణయాన్ని వెంటనే అమలుపరచలేకపోయాడు.

ఎట్టకేలకు పూజారులను పిలిపించి, ఆ స్థలాన్ని మస్జిద్ కోసం వదిలేస్తే దానికి బదులుగా బ్రహ్మాండమయిన ఒక మందిరం ఆ పరిసరాల్లోనే నిర్మించి ఇస్తానని అభ్యర్థించాడు.

అందుకు పూజారులు మనస్ఫూర్తిగానే అంగీకరించారు. సుల్తాన్ పూజారులకు ఇచ్చిన హామీని ఏ మేరకు నిర్వర్తించాడన్న దానికి మస్జిద్‌కు పశ్చిమ దిశలో ఒక ఫర్లాంగు దూరంలో ఉన్న విశాలమయిన, సుందరమయిన దేవాలయమే సాక్ష్యం. ఇంకా ఆ దేవాలయ నిర్వహణ కోసం టిప్పు సుల్తాన్ కేటాయించిన స్థిరాస్తులు ఇప్పటికీ ఉన్నాయి.

-మైసూరు పురావస్తు శాఖ వారి నివేదిక. (సల్తనతె ఖుదాదాద్-535 పేజి)

# 49. కానుక

క్రీ.శ. 1917 వ సంవత్సరంలో మైసూరు పురావస్తు శాఖవారు వెలువరించిన నివేదిక ప్రకారం మేల్‌కోట్‌లోని ఒక పూజా మందిరంలో బంగారం, వెండితో చేయబడిన ఆభరణాలు, హారతి పళ్ళాలు లభ్యమయ్యాయి. వాటిపైనున్న లేఖనాలను బట్టి అవి టిప్పు సుల్తాన్ బహూకరించినవని నిర్ధారణ అయింది. గుల్గాలీ లక్ష్మీకుంటకు చెందిన ఓ మందిరానికి కూడా టిప్పు సుల్తాన్ కానుకగా ఇచ్చిన వెండి కప్పులు నాలుగు, ఒక పళ్ళెం, ఇంకొక పూలబుట్ట ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉన్నాయి. ఇవేగాక మేల్‌కోట్ తాలూకాలోని నారాయణ స్వామి ఆలయంలోనూ ఒక వెండి పూల బుట్ట ఉంది. దానిపైన "ఇది టిప్పు సుల్తాన్ రాజు తరపున కానుక" అని లిఖించబడి ఉంది.

# 50. న్యాయోచిత వ్యవహరణ

అవి ఆర్యసమాజం ప్రోద్బలంతో హైదరాబాద్‌లో ఒక మతపరమయిన నిరసన సాగుతున్న రోజులు.

"వదంతులు ప్రజల్ని పెడదోవ పట్టిస్తాయి. దీని ప్రభావం శిక్కు సోదరులపైన పడుతుందేమోనని నాకు భయంగా ఉంది. ఇటువంటి సందర్భంలో

సిక్కు సోదరులకు ఓ విషయం చెప్పదలిచాను; శిక్కుల పట్ల అక్కడి ప్రభుత్వం న్యాయోచితంగా వ్యవహరిస్తోంది. అక్కడి శిక్కులు కూడా ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిందలేమీ చేయటం లేదు. నాందేడ్‌లో ఉన్న హుజూర్ సాహెబ్ గురుద్వారా ఆ (నిజాం) రాజ్యం సరిహద్దులలోనే ఉంది. అక్కడికి ప్రతి యేటా వేలాది శిక్కు యాత్రికులు వెడుతుంటారు. వారికి సకల సదుపాయాలు స్వయంగా ప్రభుత్వమే కల్పిస్తోంది. గురుద్వారా ఏర్పాట్లను పర్యవేక్షించడానికి ఒక అధికారి ఉన్నాడు. అయితే అక్కడి సేవకులంతా శిక్కులే. ఇటువంటి విపత్కర పరిస్థితిలో, దక్కన్ భూమిలో నివసించే సోదరులకు హాని తలపెట్టే ఏ ఉద్యమంలోనూ శిక్కులు పాలుపంచుకోరాదని ఇందుమూలంగా తెలియజేస్తున్నాను.

- అర్జున్ సింగ్ జథేదార్, లాహోర్, 25 ఫిబ్రవరి, 1935 (ఇనాయాతె ఉస్మానీ సౌజన్యంతో)

## 51. మంచిని ప్రేమించుమన్నా!

జహంగీర్ చక్రవర్తి ఏవిధంగానయితే ముస్లిం ధర్మవేత్తల పట్ల గౌరవ భావాలను చూపేవాడో, హిందూ ధర్మవేత్తల పట్ల కూడా అలాంటి గౌరవాన్నే చూపేవాడు. తన 14వ ఏట ఉజ్జయినిలో జరిగిన ఉత్సవాల్లో పాల్గొనడానికి వెళ్ళాడు. విర్రాజ్ జద్‌రూప్ అనే సన్యాసి, నగరానికి బహుదూరంగా ఉన్న ఇరుకైన గుహలో ఉంటున్నట్లు జహంగీర్ విన్నాడు. దాని పొడవు షుమారు 18 అంగుళాలు, వెడల్పు 12 అంగుళాలు. ఆ గుహ ద్వారం గుండా పాలుతాగే పిల్లవాడు దూరడం కూడా కష్టమే. ఆ సన్యాసిని ఎలాగైనా కలవాలని సంకల్పం చేసుకున్నాడు జహంగీర్. అయితే అచటి వరకు ఎటువంటి వాహనమూ వెళ్ళదని గ్రహించి మూడు మైళ్ళ పాదయాత్ర చేసి అక్కడికి చేరుకున్నాడు. ఆరు ఘడియలు ఆ సన్యాసితో గడిపాడు. ఆ సంఘటనను గురించి ఈ విధంగా వ్రాసుకున్నాడు. "వాస్తవానికి ఆ సన్యాసి ఉనికే గొప్పది. అతన్ని దర్శించి ఎంతో లాభం గడించవచ్చు. అతను వేదాంతం తెలిసినవాడు. నేను అతనితో గడిపిన ఆరు ఘడియలలో ఎన్నో మంచి మాటలు విన్నాను. వాటి ప్రభావం నాపై ఎంతగానో పడింది."

ఈ దర్శనంతో అతని తనివి తీరలేదు. అతను ఇలా అంటున్నాడు:

"మదిలో మళ్ళీ సన్యాసిని కలవాలనే కోరిక కలిగింది. అతని బస నాకు ఎంతో స్వేచ్ఛనిచ్చింది. ఉన్నత మాటలు తెలిశాయి. సృష్టికర్త అతనికి అపారమయిన 'జ్ఞానం' అనుగ్రహించాడు. అయినప్పటికీ అతను ప్రపంచ సుఖాలకు అతీతంగా నిరపేక్షాపరమైన సన్యాసత్వాన్ని స్వీకరించాడు."

ఉజ్జయిని నుండి తిరుగు ప్రయాణంలో మళ్ళీ ఆ సన్యాసిని కలుసుకోడానికి వెళ్ళాడు జహంగీర్. ఆ కలయికను ఇలా వర్ణిస్తున్నాడు: "మళ్ళీ స్వామితో చివరిసారి కలిశాను. అతన్ని వదలి రావాలంటే నా మనసు ఎంతో వ్యాకులత చెందింది."

## 52. మతరాహిత్యఫలమే ఈ గూండాగిరి

భారతదేశంలో మూడు మతాలు పుట్టాయి. ఇవికాక ఇతర మతాలు మన సమాజంలో అవిభాజ్య అంశమై పోయాయి. మన ప్రజలు మత భావాలు గలవారు. కాగా; వందేళ్లుగా మనం చూస్తున్న మతతత్వం పరదేశ పాలన ఇచ్చిన కానుకలు. మతతత్వానికి మతంతో ఎలాంటి సంబంధం లేదు. పైగా అది మత విలువలను మంటగలిపే అరాచకత్వం. అమాయక పసివాళ్లపై అత్యాచారాలకు పాల్పడుతున్న దౌర్జన్యపరులకు ఒక మతమంటూ అసలు లేదు. వాళ్లు దైవాన్ని కొలవరు. పరలోకభీతి వాళ్లకు ఏమాత్రం ఉండదు. స్వాతంత్ర్యానంతరం దేశంలో నాస్తికత్వం, పదార్థ పూజ పెచ్చరిల్లింది. ఇది గూండాగిరీకి ఊతమిచ్చింది. ఈ గూండాగిరీకి చికిత్స కేవలం మతం ఒడిలోనే ఉంది. నేడు హిందూ ముస్లింలలో నికార్సయిన దైవభావనగల వ్యక్తులు, మతం బోధించే ఉన్నత విలువలను నెలకొల్పి తద్వారా మన జనసామాన్యాన్ని మార్గవిహీనత నుండి కాపాడగలవారు జన్మించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. (తేజ్ బహదుర్ సప్రూ- రోహిల్‌ఖండ్ పత్రిక -బరేలి)

## 53. సద్భావన కోసం

ఒకసారి బక్రీద్ పండుగ సందర్భంగా అలీగఢ్‌కు చెందిన కొంతమంది విద్యార్థులు కలసి ఒక ఆవును 'ఖుర్బానీ' ఇవ్వాలని నిశ్చయించుకున్నారు. సరిగ్గా పండుగ రోజున- పండుగ నమాజ్ అనంతరం ఈ సంగతి సర్ సయ్యద్‌కు తెలిసింది. వార్త విన్నంతనే ఆయన తీవ్రంగా కలతచెందారు. వాహనం ఏర్పాటు చేయించుకుని హుటాహుటిన తన బంగ్లా నుండి కాలేజీకి వెళ్ళారు. తన బంగ్లా నుండి కాలేజీ వరకు తన మనుషుల్ని నిలబెట్టారు. విద్యార్థులను మందలించి ఆవును వారి దగ్గరి నుండి విడిపించి, దాని యజమానికి అప్పజెప్పారు. ఇక మీదట ఎన్నడూ కాలేజీ కాంపస్‌లో ఇలాంటి చేష్టకు ఒడిగట్టరాదని విద్యార్థులను హెచ్చరించారు.

మైత్రికి, సౌహార్ధతకు ఇంతకన్నా గొప్ప దృష్టాంతం ఇంకేది కాగలదు?!

(సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ గురించి మౌల్వీ అబ్దుల్ హఖ్)

## 54. స్నేహమే జీవితం

కీ.శే. బాబు శివ సహాయ్ లక్నోలో అయిష్‌బాగ్ వీధిలో ఉండేవారు. విద్యార్థి దశలోనే ఆయన ఒక క్లబ్బును స్థాపించారు. విద్యార్థిగా నేనూ ఆ క్లబ్బులో సభ్యత్వం పొందాను. చిన్న పెద్ద తేడా లేకుండా మా స్నేహం అభివృద్ధి చెందింది. కలసిమెలసి, తారతమ్యాలను ఆలోచించకుండా భోజనం చేసుకునేవారము. జూన్ 1894 సంవత్సరంలో నేను బి.ఏ. పాసయ్యాను. అప్పటికి ఎల్.ఎల్.బి. పూర్తిచేసిన బాబూ శివ సహాయ్ ఒక సోదరునిలా నన్ను పిలిచి వచ్చే నవంబర్‌లో ఎల్. ఎల్. బి. కోర్సులో జాయిన్ అవవలసిందిగా ఆదేశించారు. నా దృష్టి అంతా మెడిసిన్‌పై ఉన్నా వారు నన్ను న్యాయశాస్త్ర అధ్యయనానికి పురికొల్పారు. ఆనాటి నియమాల ప్రకారం నేను ఎఫ్.ఎ.తో పాటే న్యాయశాస్త్ర పాఠాలు చదువుకున్నాను. అయినా కొద్ది సమయమే ఉంది. దీనికి తోడు ఎం.ఏ.లో కూడా ప్రవేశించాను. చాలా భయపడేవాడిని కాని శివ సహాయ్‌గారు నా వెన్ను తట్టారు, బలవంతం చేశారు. నా హిందూ మిత్రుని వాత్సల్యాన్ని నేను మరువలేను. ఆయన కోరిక నెరవేర్చాలన్న పట్టుదల నాలో పెరిగింది. వారి ప్రోత్సాహాన్ని నేనెప్పుడూ మరచిపోలేను. ఆపై వారు నా

పాఠ్యాంశాల నోట్స్ తయారు చేసి ఇచ్చేవారు. రాత్రి సమయాల్లో నాకు పాఠాలు చెప్పేవారు. హాలెండ్ న్యాయశాస్త్రానికి సంబంధించిన పాఠ్యాంశాలపై బాబు శివ సహాయ్ తరువాత ముద్రించిన వ్యాఖ్యానం ఆనాటిదే! దాంతో న్యాయశాస్త్రాన్ని అధ్యయనం చేసే విద్యార్థులకు లాభం చేకూరింది. వారి గైడ్‌ను ఆధారంగా చేసుకునే నేను 1894 జులై 17 నుండి న్యాయశాస్త్ర అధ్యయనానికి పూనుకున్నాను. 26 నవంబర్ 1894లో ఎల్.ఎల్.బి. పరీక్షలు మొదలయ్యాయి. జనవరి 1895లో మా ప్రిన్సిపాల్ 'వాల్లెట్' అలహాబాద్ యూనివర్శిటీ న్యాయశాస్త్ర పరీక్షా సంఘం సమావేశాల్లో పాల్గొని తిరిగి వచ్చి, ప్రథమ శ్రేణిలో నేను ఉత్తీర్ణుడయినట్లు ఫలితాలు రాకపూర్వమే తెలియజేశారు. ఈ విషయాన్ని నేను బాబూ శివ సహాయ్‌కు తెలియజేసినప్పుడు వారి ఆనందం వర్ణనాతీతం.

ఆయన హిందువు, నేను ముస్లింని. అయినప్పటికీ మా స్నేహానికి మతాలు అడ్డుగోడలుగా నిలువలేదు. నేనీ విధంగా తెలియజేయడంలో ఉద్దేశ్యం, ఈ దేశంలో ఎప్పుడూ హిందూ ముస్లిముల మధ్య పోరాటం జరగలేదని కాదు. మొత్తం మీద దేశంలో హిందూ, ముస్లిములు ఇరువురూ అన్యోన్యంగా, అప్యాయతతో నడచుకునేవారని తెలియజేయడానికే. మేమంతా కుల, మత భేదాభిప్రాయాన్ని విడనాడి శాంతి, సహనాలతో జీవనాన్ని సాగించేవారము. -మిర్జా యార్ జంగ్ సమీ ఉల్లా బేగ్, హైదరాబాద్ దక్కన్ ప్రధాన న్యాయమూర్తి, డిశెంబర్ 1924

## 55. సామరస్యం

ఈ పట్టణం (సూరత్)లో సుమారు నూరు మతాలను విశ్వసించే ప్రజలుంటారు. అయినా వారి మధ్య ఎన్నడూ మతపరమైన పోట్లాటలు తీవ్రరూపం దాల్చలేదు. ప్రతి ఒక్కరికీ ఇక్కడ తమకు ఇష్టం వచ్చిన దేవుడ్ని నమ్మే, మత ధర్మాన్ని ఆచరించే, ప్రచారం చేసుకునే స్వేచ్ఛ ఉంది. కేవలం మతపరమయిన విభేదాల ప్రాతిపదికగా పరస్పరం కక్షకట్టి ప్రతీకారం తీర్చుకునే స్వభావం ప్రజా సమూహంలో ఎక్కడా కానరాదు.

- ఔరంగజేబు కాలంలో భారత దేశాన్ని సందర్శించిన యాత్రికుడు హెమెల్డన్ పర్యటనానుభవాలు, ప్రథమ భాగం: పేజి:162

# 56. యాద్ రహేగా

సుమారు 22, 23 ఏళ్ల నాటి మాట. బహుశా క్రీ.శ. 1928లో అనుకుంటా! ఎముకలు కొరికే చలి కాలం. ఆ రోజుల్లో నేను అమ్రోహాలో ఉపాధ్యాయునిగా పనిచేస్తున్నాను. ఒక పనిమీద దేవ్‌బంద్ వెళ్ళాల్సి వచ్చింది. పగటిపూటే ట్రైన్ ద్వారా వెళ్లి పొద్దుగూకక ముందే తిరిగి రావాల్సిన ప్రోగ్రాం పెట్టుకున్నాను. అందుకే పడకగానీ, కంబలిగానీ తీసుకెళ్ళలేదు. దేవ్‌బంద్‌లో పని ముగించుకుని సాయంత్రానికి గాజియాబాద్ చేరుకునే ట్రైన్‌కు బయలుదేరాను. అక్కడి నుంచి అమ్రోహా వెళ్ళే బండిని క్యాచ్ చేయాల్సి ఉంది. కాకతాళీయంగా ఆ రోజు ఆ బండి లేటయ్యింది. గాజియాబాద్ చేరాక తెలిసింది- అమ్రోహాకు వెళ్ళే ట్రైన్ వెళ్ళిపోయిందని. రాత్రి పదయితేగాని మరో బండిరాదు. ఫ్లాట్‌ఫాంలోనే ఒక బెంచీపై కూలబడి నిరీక్షించసాగాను. నిద్రపోవాలన్న ఆలోచన ఏమాత్రం లేదుగాని నిద్రపట్టేసింది. కొంత సేపు నిద్రపోయాక ఒక వ్యక్తి నన్ను లేపి ఎక్కడి కెళ్ళాలి? అని అడిగాడు. అమ్రోహా అన్నాను. ఇదిగో బండి వెళ్ళిపోతోంది! ఇప్పుడు తెల్లారే వరకూ మరో బండిలేదు అన్నాడతను. స్టేషన్‌లోని విశ్రాంతి గదికి వెళ్ళమని అతను సలహా ఇచ్చాడు. అతని సలహాను అక్షరాలా పాటించాను. అప్పటికే రాత్రి 11 అయ్యింది. పడుకుని లేవటం వల్ల కాబోలు మరింత చలిగా అనిపిస్తోంది. రాత్రంతా గడపాలి. అక్కడున్న బెంచీపై కాస్సేపు కూర్చుంటూ, మరి కాస్సేపు పచార్లు చేస్తూ టైంపాస్ చేస్తున్నాను. ఆ రోజుల్లో ఆ స్టేషన్లో ఒక మామూలు టీ స్టాల్ తప్ప మరొకటి లేదు. ఆ టీ కొట్టువాడు కూడా తన కొట్టు మూసేశాడు. నేను మాటిమాటికీ అతని వద్దకెళ్ళి- బ్రతిమాలి- టీ చేయించుకుని తాగుతున్నాను. తీవ్రమయిన చలి బాధకన్నా ఇంకొక బాధ నన్ను మరింత తీవ్రంగా పీడిస్తోంది. ఆ విశ్రాంతి నిలయంలో నేనుగాక మరో 10,12 మంది ఉన్నారు. పడక సామగ్రి ఏదీ లేకుండా, పడుకోకుండా అటూ ఇటూ తిరుగుతున్న నన్ను వాళ్లంతా అనుమానంగా చూస్తున్నారు. ఆ అనుమానంతో వాళ్లు సయితం ప్రశాంతంగా నిద్రపోలేకపోతున్నారు. నేను నోరు తెరచి వాళ్లను సముదాయించనూలేను. ఈ మానసిక క్షోభతో నేను కుమిలిపోతున్నాను. దీనికి పరిష్కారం ఏమీ లేదు. మరోవంక చలి తీవ్రత నుండి నన్ను నేను కాపాడుకునే మార్గం

కూడా లేదు. రాత్రి రెండున్నర కావొచ్చింది. అంతలోనే డెహ్రాడూన్ నుంచి అనుకుంటాను ఒక ట్రైన్ వచ్చింది. ఆ ట్రైన్‌లో నుంచి నలుగురైదుగురు ప్రయాణీకులు దిగి విశ్రాంతి గది వైపునకు వచ్చారు. వాళ్లంతా పడకవేసుకుని పడుకుంటున్నారు. వాళ్లలో ఒక సిక్కు నవయువకుడున్నాడు. వయస్సు 16,17 కన్నా ఎక్కువ ఉండదు. అతని వాలకం చూస్తేనే తెలుస్తోంది- గొప్పింటి వాడని! పర్వత ప్రాంతం నుంచి వచ్చిన వాడవటం చేత అతని దగ్గర చాలా పెద్ద పడక ఉంది. అతను పడక పరచాడు. బెంచీపై కూర్చుని ఉన్న నన్ను చూసి, ఇక్కడెక్కడయినా పాలు లభిస్తాయా? అని అడిగాడు. 'ఇక్కడొక టీ కొట్టుందిగానీ, దాని యజమాని పడుకున్నాడ'ని అన్నాన్నేను. మీరు కాస్త నా సామాను చూస్తూ ఉండండి. వెళ్ళి పాలు తీసుకుంటాను. ఈ రాత్రి భోంచేయలేదు అని అన్నాడా అబ్బాయి.

ఆ అబ్బాయి టీ కొట్టుకెళ్ళి పాలు తెచ్చుకున్నాడు. మర్యాదపూర్వకంగా నాకు పాలివ్వబోయాడు. మృదువుగా తిరస్కరించాను. పాలు తాగి పడక మీద మేను వాల్చాడతను. నా మూలంగా ఈ అబ్బాయి కూడా బహుశా ప్రశాంతంగా నిదురపోలేడేమోనన్న బాధ నన్ను తొలచివేస్తోంది. కొన్ని నిముషాల తర్వాత ఆ కుర్రాడు నా దగ్గరకు వచ్చి "మీరెందుకిలా కూర్చుండిపోయారు? మీ వద్ద పడక గానీ, కంబలి గానీ లేదా?" అని అడిగాడు.

నా పరిస్థితి అంతా అతనికి వివరించాను. వెంటనే అతడు తన పడకలోనుంచి రెండు కంబళ్ళు తీసి, ఒక కంబలి పరచాడు. "నేను దీని మీద పడుకుంటాను. మరో కంబలిని కప్పుకుంటాను. మీరు నా పడక మీద పడుకోండి" అన్నాడు.

మొదట నేను కాస్త మొహమాటపడ్డాను. కాని అతను పట్టుబట్టాడు. ఎట్టకేలకు నేను అతని కోరికను కాదనలేక పోయాను. 'సరే నువ్వు వెళ్ళి పడుకో. నేను నీ కంబలిపై విశ్రాంతి తీసుకుంటాన'ని అన్నాను. 'తమరు నా పడక మీద పడుకునేంత వరకూ నేనిలాగే నిలబడి ఉంటాన'న్నాడా నూనూగు మీసాల కుర్రాడు. అతని అభ్యర్థనను ఇక తిరస్కరించటం భావ్యం కాదనుకుని పడుకున్నాను. ఆ అబ్బాయిలోని సత్ప్రవర్తనను చూసి నా కళ్లు చెమర్చాయి. ఆ

అబ్బాయి మాత్రం నిశ్చింతగా పడుకున్నాడు. కాని నా కంటికి నిద్ర పట్టలేదు. తెల్లవారిన తరువాత సెలవు తీసుకుని ఇద్దరం ఎవరి దారిన వాళ్ళం వెళ్ళి పోయాము. అతనిలోని మంచితనం, మర్యాద గురించి తీవ్ర ఆలోచనలో పడిపోయిన నేను కనీసం అతని పేరు, అడ్రసును కూడా నోట్ చేసుకోలేక పోయాను. అతన్ని మళ్ళీ కలుసుకోలేకపోయానే! అన్న బాధ నన్ను పీడిస్తూ ఉంటుంది. ఆ సంఘటన జ్ఞాపకమొచ్చినప్పుడల్లా, ఆనాటి నా మానసిక స్థితిని తలచుకుంటాను. ఆ అబ్బాయి మేలును కాంక్షిస్తూ ప్రార్థిస్తాను. ఆ అబ్బాయిని జీవితంలో మళ్ళీ ఎప్పుడయినా కలుసుకుంటే అతని రుణం తీర్చుకొందును కదా! అని మనసు ఆరాటపడుతూ ఉంటుంది. కాని ఇలాంటి ఎన్నో ఆశల ఆరాటంతోనే మనిషి జీవన పోరాటాన్ని ముగించుకుని వెళ్ళిపోతాడు.

-మౌలానా ముహమ్మద్ మంజూర్ నోమానీ, అల్ ఫుర్కాన్ సంపాదకులు,

(నిదాయె మిల్లత్: 13-4-1962)

## 57. మనసుంటే మార్గముంటుంది

స్వాతంత్ర్యానంతరం భారత దేశంలో ఎంత భయంకరమైన మత కలహాలు జరిగాయో గత 15 సంవత్సరాల క్రితం దేశంలో సంభవించిన పరిణామాల గురించి జ్ఞాపకమున్నవారికి బాగా తెలుసు! సరిహద్దులకు అవతల అమాయక హిందువులు, సిక్కులు మారణకాండకు గురవగా, సరిహద్దులకు ఇవతల అమాయక ముస్లిములు నిర్దాక్షిణ్యంగా ఊచకోతకు లోనయ్యారు. ఏళ్లు గడచిపోయినా మానవత్వం విలవిల్లాడిపోయే ఆ సంఘటనలను తలచుకుంటేనే గగుర్పాటు కలుగుతుంది. ఆనాడు మనుషుల్లో నుంచి మానవత్వం పూర్తిగా సమసిపోయిందా? వారి హృదయాలలో తోడేళ్లు, క్రూర మృగాలు, పాములు, తేళ్లు తిష్ఠవేసుకున్నాయా? అనిపించింది. అమాయక పసిపిల్లలను, ఆడవాళ్లను సయితం వాళ్లు వదలిపెట్టలేదు. నడిచే ట్రైన్లలో నుంచి రాళ్ళు విసిరినట్లుగానే మనుషులను బయటకు విసిరేశారు. ఈ పరిస్థితుల దృష్ట్యా ఉత్తర భారత దేశంలో అనేక ప్రాంతాలలో ముస్లింలు రైలు ప్రయాణం చేయటమే మానుకున్నారు. ఆ తరువాత ప్రభుత్వం తరఫున కొన్ని

ప్రత్యేక ఏర్పాట్లు చేయబడ్డాయి. ప్రతి రైలుకు రెండు అదనపు బోగీలను తగిలించి వాటిని ముస్లింల కోసం కేటాయించారు. ఆ బోగీలలో సాయుధ రక్షక భటులు కూడా నియమించబడేవారు. ఆ రోజుల్లోనే నేను లక్నో నుండి సహారన్‌పూర్, దేవ్‌బంద్‌లకు బయలుదేరాను. అప్పటి వ్యవస్థ ప్రకారం నేను లక్నోలో ముస్లింలకు కేటాయించబడిన ప్రత్యేక బోగీలోనే కూర్చోవలసి వచ్చింది. జీవితంలో నాకెదురయిన తొలి అనుభవం అది! ఆ డబ్బాలలో ముస్లిం ప్రయాణీకులు కెపాసిటీకన్నా ఎంతో ఎక్కువగా ఉన్నారు.

అందువల్ల బోగీలు ప్రయాణీకులతో కిక్కిరిసినట్లున్నాయి. నేను ఆలోచనల్లో పడిపోయాను- ఏ స్వాతంత్ర్యం కోసం మేము మా వంతు పాత్రను సమర్థంగా పోషించామో, ఏ స్వాతంత్ర్య బాటలో మా పెద్దలు అసాధారణ త్యాగాలు చేశారో, ఆ స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత సహారన్‌పూర్ వరకు కూడా స్వేచ్ఛగా రైలు ప్రయాణం చేయలేమా?! అగ్గిపెట్టెల్లాంటి ఈ రైలు డబ్బాలలో కూడా సాయుధులైన పోలీసులు ముస్లిములకు కాపలా కాయాల్సిందేనా?! ఈ ఆలోచన సహజంగానే నా బుర్రను తొలచివేయసాగింది. ఆ రైలు బోగీల్లో కూర్చున్న ఇతర ప్రయాణీకులు చర్చించుకుంటున్న తీరు కూడా నా మెదడును మరింతగా తొలచివేసింది. ఈ సంక్లిష్ట పరిస్థితుల నుండి బయటపడే ఆలోచనగానీ, జీవిత ధ్యేయం పట్ల శ్రద్ధాసక్తులుగానీ, పరలోక చింతనగానీ వారికి లేశమయినా లేవనీ, పరిస్థితులతో వారు రాజీపడిపోయారని వాళ్ల సంభాషణనుబట్టి నాకు అవగతమయ్యింది. ఈ ఆలోచనల నుండి తేరుకొనకముందే హర్‌దోయి స్టేషన్ వచ్చింది. అస్ర్ నమాజ్ చేసుకునేందుకు నేను క్రిందికి దిగబోయాను. బండి దిగవద్దని ప్రక్కవారంతా గట్టిగా వారించారు. నేను క్రిందికి దిగితే ఎక్కడ ముష్కరమూకల ధాటికి బలైపోతానోనని వాళ్లు భయపడుతున్నారు. వాళ్లకు నచ్చజెప్పడానికి ఎంతగానో ప్రయత్నించాను. కాని నా ప్రయత్నం ఫలించలేదు. కాలు క్రిందమోపరాదని వారు అరిచారు. మరికొంతమంది శ్రేయోభిలాషులైతే నా ధోరణిపట్ల ఆగ్రహం కూడా వెలిబుచ్చారు. కాని నేను మాత్రం నమాజ్‌ను వదలడానికి సంసిద్ధంగాలేను. బండి దిగి, తాపీగా వుజూచేసి, ఫ్లాట్‌ఫారం మీదే దుప్పటి పరచుకుని నమాజ్ చేశాను. నా నమాజ్

ముగియగానే బండి కదలసాగింది. వచ్చి ఆ బోగీలో కూర్చున్నాను. నేను సహ ప్రయాణీకులతో చెప్పాను- నేను తలచుకుంటే రైలు లోపల కూడా నమాజ్ చేయగలిగేవాణ్ణి. కాని మీ మనసుల్లో తిష్ఠవేసుకుని ఉన్న భయాందోళనలను తీసివేయాలన్న తలంపుతోనే ఈ విధంగా ప్రవర్తించాను. నేను నిశ్చింతగా ప్లాట్‌ఫారం మీదే నమాజ్ చేశాను. అల్లంత దూరాన వెళ్ళి మంచినీళ్లు కూడా సీసాలో నింపుకువచ్చాను. కాని నన్నెవరూ ఏమీ చేయలేదు. మీరు ఈ దేశంలో ఉండాలనే అనుకుంటే భయాందోళనలను మీ మనసుల్లో నుంచి తీసిపారెయ్యవలసి ఉంటుంది. మానవ జగతిలో జాతులపై ఆపద సమయాలు ఆసన్నమవుతాయి. అయితే గుండె ధైర్యంతో ఉంటే, ఆలోచించి సరైన పంథాను అనుసరిస్తే పరిస్థితుల్లో మార్పు రావటం కూడా సంభవమే. మీరు పరిస్థితుల స్వరూపాన్ని కాస్త అర్థం చేసుకోవడానికి ప్రయత్నించండి- అని ఉపదేశించాను.

మగ్రిబ్ నమాజ్ కూడా రైలు ఆగినప్పుడు- ప్లాట్‌ఫారం మీదే చేయాలని మనసులో అనుకున్నాను. ఆ తరువాత సాయుధ దళాలున్న ప్రత్యేక బోగీని వదలిపెట్టి సాధారణ బోగీలో కూర్చోవాలని కూడా నా మనసు ఉబలాట పడసాగింది. సాయుధ పోలీసుల నీడలో నిర్ణీత బోగీలలోనే ప్రయాణం చేయటం నాకు అవమానకరంగా తోచింది. పరిస్థితి ఇలాగే ఇంకా కొన్నాళ్ళు కొనసాగితే ఈ దేశంలో ముస్లింలు నిత్యం పిరికిపందలుగా జీవించవలసి ఉంటుంది.

ట్రైన్ షాజహాన్‌పూర్‌లో ఆగబోతోంది. బండి ఆగగానే నేను బోగీ మారక తప్పదని దృఢంగా నిశ్చయించుకున్నాను. మగ్రిబ్ నమాజ్ వేళయింది. నేను పథకం ప్రకారమే దిగి ప్లాట్‌ఫారం మీద దుప్పటి పరచుకుని నమాజ్ చేయసాగాను. వేరొక డబ్బాలోకెళ్ళి కూర్చోవడాన్ని పోలీసులు అడ్డుకుంటారని నాకు తెలుసు. అందుకే ట్రైన్ కదిలే వరకు నమాజ్ చేసిన స్థలంలోనే కూర్చుని ఉండి, ట్రైను కదులుతున్నప్పుడు పరుగెత్తుకునివచ్చి వేరే డబ్బాలో దూరాలని ప్లాన్ వేశాను. అలాగే చేశాను కూడా. రక్షక భటులు అరుస్తూ ఉండిపోయారు. కాని నేను వినీవిననట్లుగా వ్యవహరించి నా పథకంలో సఫలీకృతుణ్ణి అయ్యాను. ఒక

ముస్లిం వ్యక్తి! అందునా గడ్డం పెంచుకున్న మౌల్వీ టైపు మనిషి ఈ విధంగా సాధారణ బోగీలోనికి జొరబడటం చూసి అందరూ ఆశ్చర్యపోయారు. అందరూ నా వంకే చూస్తున్నారు. పాపం అన్నెంపున్నెం ఎరుగని ఈ అమాయకుడు తెలీక ఇలా వచ్చేసి ఉంటాడని బహుశా మంచి వారైన హిందువులు ఆలోచిస్తుండవచ్చని నేను ఊహించాను. వాళ్ల చూపుల్లోని ఆంతర్యాన్ని పసిగట్టిన నేను, "మరేం ఫరవాలేదు, నేను ఉద్దేశ్యపూర్వకంగానే ఈ బోగీలోకొచ్చాను. నేను ముస్లిములుండే బోగీలోనే మొదట కూర్చున్నాను. నా సామాను కూడా అక్కడే ఉంది. ఆ బోగీలో మాత్రమే కూర్చోవటం నాకు తప్పనిపించింది. ఆ బోగీగాక మిగతా బోగీల్లో కూర్చున్నవారంతా మనుషులు కారా? వారు క్రూరజంతువులా? ఈ విషయం నాకు మింగుడుపడలేదు. అందరి అంచనా తప్పని నిరూపించడానికే నేను ఇక్కడికొచ్చాను. నేను మీ అందరినీ నాలాంటి మనుషులుగానే, మర్యాదస్తులుగానే తలపోస్తున్నాను. మరో విషయం ఏమిటంటే; నన్ను పుట్టించినవాడు ఈ లోకంలో నాకు నూకలుంచినంతకాలం నన్నెవరూ ఏమీ చెయ్యలేరన్నది నా విశ్వాసం. నా నూకలు చెల్లిపోయిన తరువాత నన్నెవరూ మృత్యు ఒడిలోకి పోకుండా కాపాడలేరు కూడా." బోగీలోకి వెళ్ళగానే అక్కడున్న వారినుద్దేశ్యించి ఈ మాటలు నిలబడే పలికాను. ఈ మాటల ప్రభావం వారిపై ఎంతగా పడిందంటే ప్రతి ఒక్కరూ నన్ను తమ ప్రక్కన కూర్చోమని ప్రాధేయపడసాగారు. వారిలో పెద్ద వయస్సున్న ఒక వ్యక్తి ప్రక్కన నేను కూర్చున్నాను. ఇక అక్కడినుంచి పిచ్చాపాటీ మొదలయ్యింది. దాదాపు అందరూ పరిస్థితుల స్వరూపాన్ని నెమరువేసుకుని దానిపై తమ ఆవేదనను వ్యక్తపరచసాగారు. గంట సేపు అలా ప్రయాణించిన పిదప బరేలీ స్టేషన్ వచ్చింది. షాజహాన్‌పూర్ స్టేషన్‌లోనే భద్రతా సిబ్బంది నన్ను చూసింది. నేను ఏ బోగీలో ఎక్కానో వాళ్ళకి తెలుసు. బరేలీలో రైలు ఆగగానే పోలీసు నా దగ్గరకు పరుగెత్తుకువచ్చి మీరు మమ్మల్ని ఇబ్బందిలో పడేస్తున్నారు. మిమ్మల్ని కాపాడటం మా విధి అంటూ ఆగ్రహాన్ని, ఆందోళనను కూడా వెళ్లగ్రక్కసాగాడు.

"ఎందుకు ఆందోళన? చూడండి, నేను ఇక్కడ నిక్షేపంగా ఉన్నాను. దైవచిత్తమయితే నేనిక్కడ క్షేమంగా ఉండగలను" అని అన్నాను. అయినా సరే ఆ పోలీసు నన్ను అక్కడినుంచి లాక్కెళ్ళాలని ప్రయత్నించాడు. కాని ఆ

బోగీలోని వారెవరూ అందుకు ఒప్పుకోలేదు. "ఈయనగారు ఇక్కడే ఉంటారు. ఒక మనిషిని మీ వెంట పంపిస్తాం. మీరు ఈయన గారి సామానును ఇక్కడికే పంపించండి" అని పోలీసుకు సలహా ఇచ్చారు అందరూ. ఈ అనుభవం తరువాత; ప్రతి స్టేషన్లోనూ దిగి మరో కొత్త డబ్బాలోకి వెళ్ళి కూర్చోవాలని నా మనసు తహతహలాడింది. అయితే సహారన్‌పూర్ వరకూ వాళ్లను విడిచివెళ్ళరాదని ఆ బోగీలోని వారంతా కోరారు. అనురాగభరితమయిన వారి కోర్కెను తిరస్కరించలేకపోయాను. రాత్రి మూడుగంటల సమయంలో సహారన్‌పూర్ స్టేషన్‌కు చేరుకుంది రైలుబండి. అప్పటిదాకా వాళ్లతోనే కలసి ప్రయాణం చేశాను. -మౌలానా మంజూర్ నోమానీ (నిదాయె మిల్లత్: 21-3-1962)

# 58. సాహసమే విజయానికి సోపానం

పంజాబ్ మెయిల్ ద్వారా రాత్రి మూడు గంటలకు సహారన్‌పూర్ స్టేషన్ చేరుకుని తెల్లవారే వరకూ వెయిటింగ్ రూంలోనే ఉన్నాను. నేను దేవ్‌బంద్ వెళ్ళాల్సి ఉంది. ఆ బండి ఉదయం పంజాబ్ నుండి వస్తుంది. అది ఢిల్లీ వరకూ వెళ్తుంది. ఆ రోజుల్లో పంజాబ్ నుండి వచ్చే రైళ్లల్లో చాలా వరకు పాకిస్తాన్‌కు చెందిన పశ్చిమ ప్రాంతాల వారు, సింధ్‌వాసులు, పశ్చిమ పంజాబీ ప్రజలు, హిందువులు, సిక్కులు ప్రయాణించేవారు. వారిలో చాలామంది బాధితజనులే. శరీరావయవాలు కోల్పోయినవారు, క్షతగాత్రులు ఉండేవారు. ఈ కారణంగా వారి హృదయాలలో ముస్లిముల పట్ల పగ ద్వేషం రగులుతూ ఉండేవి. ఈ కారణంగా కూడా ముస్లిములు తమకు కేటాయించబడిన ప్రత్యేక బోగీలలో మాత్రమే కూర్చోవాలని కోరుకునేవారు. వారి వెంట సాయుధ పోలీసులుండేవారు. ఆ పరిస్థితులు నాకు తెలుసును. అయినాసరే నేను తమాయించుకుని సాధారణ బోగీలోనే కూర్చోవాలని నిశ్చయించుకున్నాను. సాహసోపేతమైన ఈ పని కోసం గుండె దిటవు చేసుకోవలసి ఉంటుంది. ఆ సందర్భంగా నేను దివ్య ఖుర్‌ఆన్‌లోని ఎన్నో ఆయతులను మననం చేసుకుని మనసుకు సర్దిచెప్పుకున్నాను. స్టేషన్ నుండి రైలు కదలిన తర్వాతే పరుగెత్తు కుంటూ వెళ్ళి జనరల్ కంపార్ట్‌మెంట్‌లో కూర్చోవాలని

సంకల్పించుకున్నాను. అనుకున్నట్లే చేశాను. అప్పటి వరకూ వెయిటింగ్ రూంలో కూర్చొని ఉండి, రైలు స్టేషన్ నుండి కదలగానే పరుగెత్తుకుంటూ వెళ్ళి ఒక బోగీలో జొరబడ్డాను. ఆ బోగీలో బాగా రద్దీ ఉంది. అంచేత నేను నిలబడవలసి వచ్చింది. కొంతమంది ప్రయాణీకులు ఆశ్చర్యంతో, మరి కొంతమంది ఆగ్రహంతో నన్ను చూస్తుండటం నేను గమనించాను. ఆ బోగీలో చాలా వరకు పాకిస్తాన్ వైపు నుండి వచ్చే సిక్కులు, హిందువులే ఉన్నారు. హిందువులు ఎక్కువగా ఉన్నారు. సిక్కు సోదరులు నలుగురైదు గురు మాత్రమే. పైన బెర్తులో కూర్చున్న ఒక వ్యక్తి నావంక చూచి, ఈ ముస్లింలు మన దేశంలోనయితే హాయిగా సంచరిస్తున్నారు. కాని పాకిస్తాన్‌లోనే మా పట్ల ఇంత ఘోరం జరుగుతోంది అని కామెంట్ చేశాడు. (అతని మాటలు నాకు పూర్తిగా అర్థం కాలేదు. సగం ఉర్దూలో, సగం పంజాబీ భాషలో అతను చెప్పాడు) తలపైకెత్తి చూశాను. గాయపడిన ఒక హిందూ సోదరుడతను. అతని శరీరంపై అనేక చోట్ల కట్లు కట్టబడి ఉన్నాయి. నిష్ఠూరంగా అతను చెప్పిన మాటలు ఆ బోగీలోని ఇతర ప్రయాణీకులపై సహజంగానే ప్రభావం చూపాయి. వాతావరణం నాకు వ్యతిరేకంగా తయారవుతోందని అర్థం చేసుకున్నాను. ఆవేశపూరితులైన కొంతమంది నా వైపునకు రావటం కూడా నేను గమనించాను. అంతలోనే మధ్యవయస్కులైన ఇద్దరు సిక్కు సోదరులు నన్ను తమ మధ్య కూర్చోబెట్టుకున్నారు. తమ కృపాణాలను పైకెత్తి, 'ఖబడ్దార్! ఎవరయినా ఈయనపై చెయ్యిచేసుకున్నారో చంపేస్తాం!' అని హెచ్చరించారు. "మీ దగ్గర దమ్ముంటే మిమ్మల్ని వేధించిన వారిపై పగతీర్చుకోండి. ఈయన మీకేం చేశాడనీ?" అని చెబుతున్నారు. ఇది దైవం తరపున జరిగిన అనూహ్యమైన ఏర్పాటు! మరి ఆనాడు సిక్కుల గురించి ముస్లిముల్లో సదభిప్రాయం లేదు. తూర్పు పంజాబ్ ప్రాంతంలోని ముస్లిముల హత్యాకాండలో సిక్కులు హిందువులకన్నా ఎక్కువ కిరాతకంగా ప్రవర్తించారని ఆ రోజుల్లో అందరూ చెప్పుకునేవారు. కాని నా సమక్షంలో జరిగింది తద్భిన్నంగా ఉంది. ఆ ఇద్దరు సిక్కు సోదరులేగనక నన్ను తమ మధ్య కూర్చోబెట్టుకుని, హెచ్చరికలు జారీ చెయ్యకుండా ఉంటే, నా వైపునకు దూసుకువస్తున్న వారు అఘాయిత్యానికి పాల్పడేవారేమో! కాని సిక్కు సోదరుల ప్రతిఘటన మూలంగా వాళ్లు ఆగి పోయారు. కొన్ని నిమిషాలపాటు ఆ బోగీలో గంభీర ప్రశాంతత నెలకొంది. నేను

ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటూ పై బెర్తులో కూర్చుని ఉన్న క్షతగాత్రుని చూచి, "సోదరా! నీవు బాధించబడ్డావు. అన్యాయంగా నిన్ను ఎవరో గాయపరిచారు, నీకు కోపం రావటం సబబే. కాని సోదరా! అక్కడ జరిగిన అఘాయిత్యానికి గాను ఇక్కడి ముస్లిములపై ప్రతీకారం తీర్చుకోవటం, ఇక్కడ జరిగిన అమానుషానికి అక్కడి హిందూ సిక్కు సోదరులను దండించటం ఎంత వరకు సబబు? ఈ పైశాచికత్వం ఇలాగే కొనసాగుతుంటే చివరకు హిందూ-ముస్లిముల పరిస్థితేంకాను? ఈ మతోన్మాదం ఎన్ని కుటుంబాలను నాశనం చేసింది? కనీసం ఇప్పుడయినా జ్ఞానోదయం కలగాలి" అని చెప్పాను. ఆ తర్వాత అక్కడ కూర్చున్న వారందరినీ ఉద్దేశ్యించి, "నేను తెలీక ఇందులోకి ఎక్కాననుకుంటు న్నారా? అదేం కాదు. కావాలనే ఇక్కడికొచ్చాను. నన్ను పుట్టించిన వాడు నా మరణ సమయాన్ని కూడా నిశ్చయించి ఉన్నాడని నాకు తెలుసు. ఆ సమయం ఆసన్నమయ్యే వరకూ నన్నెవరూ చంపలేరు. ఇది నా నమ్మకం. బహుశా మీరు కూడా ఇలాగే భావిస్తారనుకుంటాను" అని అన్నాను. ఆ పిదప ఆ ఇద్దరు సిక్కు సోదరులనుద్దేశ్యించి, "వీరెవరో నాకు తెలీదు, నేనెవరో వీళ్లకీ తెలీదు. కాని నా మరణ సమయం ఇంకా ఆసన్నం కాలేదు గనక దేవుడు నా సంరక్షణ కొరకు వీళ్లని నిలబెట్టాడు" అని చెప్పాను. ఖద్దరు చొక్కా, ఖద్దరు టోపీ ధరించిన ఒక గాంధేయవాది కూడా ఆ బోగీలో ప్రయాణిస్తున్నారు. నా మాటలు విన్న తరువాత ఆయనగారు కూడా పగ, ప్రతీకారం మంచిది కాదంటూ కాస్సేపు చక్కగా ఉపదేశించారు. ఆయన హిందువే. ఆయన మాటల తీరును బట్టి ఆయన మంచి వక్త అని తెలుస్తోంది. అరగంటలోనే 'దేవ్‌బంద్' స్టేషన్ వచ్చేసింది. నేనక్కడ దిగిపోయాను.

మూడు రోజులు దేవ్‌బంద్‌లో ఉండి ఢిల్లీకి బయలుదేరాను. ఢిల్లీ వరకూ ముస్లింల బోగీలో వెళ్ళానో, జనరల్ బోగీలో ప్రయాణం చేశానో, నాకు ఇప్పుడు సరిగ్గా గుర్తు లేదు. మొత్తానికి ప్రోగ్రాం ప్రకారం ఢిల్లీ చేరుకున్నాను. ఢిల్లీలో కూడా ముస్లింలు తమ తమ పేటల్లో, గల్లీల్లో మినహాయించి వేరితర ప్రదేశాలలో నిర్భయంగా తిరిగేవారు కారు.

నేను ఢిల్లీలో ఖాసిమ్ జాన్ స్ట్రీట్‌లో ఉన్న 'జమియతుల్ ఉలమా' కార్యాలయానికి వెళ్ళవలసి వుంది. ముందు చాందినీ చౌక్‌కి వెళ్ళి, అక్కడినుంచి

బల్లిమారాన్ మీదుగా ఖాసిమ్‌జాన్ వీధికి వెళ్ళాలని వ్యూహరచన చేశాను. పరిస్థితులు కొద్దికొద్దిగా కుదుటపడుతున్నందున, ఇప్పుడు ముస్లింలు బజార్లలో స్వేచ్ఛగా సంచరిస్తుంటారని నా ఊహ.

ఢిల్లీ స్టేషన్‌లో సామాను మోసుకురావటానికి ఒక కూలివాణ్ణి మాట్లాడుకున్నాను. స్టేషన్ బయట జట్కా బండీలు నిలబడి ఉన్నాయి. ఎక్కడి కన్నట్టు వారంతా నన్ను చూస్తున్నారు. ఖాసిమ్‌జాన్ వీధికి అన్నాను. బండెక్కండి అన్నాడొక వ్యక్తి. 'అక్కరలేదు, నడిచే వెళతాను' అన్నాను. నేను ఢిల్లీకి కొత్తవాణ్ణి అని వారంతా అనుకున్నారు కాబోలు. ఈ దారిగుండా నడచివెళ్ళటం భావ్యం కాదని సలహా ఇచ్చారు. నా శ్రేయాన్ని కాంక్షించి చెప్పేవారి మాటల్ని పూర్తిగా అర్థం చేసుకున్నాను. 'మీ సలహాకు కృతజ్ఞతలు. కాని నేను మాత్రం నడిచే వెళ్ళాలని నిశ్చయించుకున్నాను' అని చెప్పాను. బహుశా నా దగ్గర డబ్బులు లేవని తలపోశారు గామోలు- 'మీరు మాకు డబ్బులేమీ ఇవ్వనక్కరలేదు. కాని మీరు నడచి వెళ్ళే సంకల్పాన్ని విరమించుకోండి' అన్నారు. "నా దగ్గర డబ్బులు లేకేం. చాలా డబ్బులున్నాయి. కాని ఈ వీధుల గుండా నడచి వెళ్ళాలని నేను దృఢంగా నిశ్చయించుకున్నాను" అని అన్నాను. ఒక జట్కా బండివాడైతే నా ముందుకు వచ్చి ఆప్యాయత, ఆగ్రహం కలగలసిన స్వరంతో ఇలా అన్నాడు: "ముల్లాజీ! మీ మౌల్వీలంతా చాలా పిసినారులు. డబ్బు ఖర్చుపెట్టాలంటే ప్రాణం మీదికివస్తుంది. నేను ఫ్రీగానే మిమ్మల్ని తీసుకువెళతాను. వచ్చి బండెక్కండి" అన్నాడు. అప్పటికీ నేను అతని కోర్కెను నిరాకరించటంతో అతనికి కోపం వచ్చింది. "పో, కోరి కోరి మరణాన్ని కొనితెచ్చుకుంటానంటే ఎవరయినా నీకెలా సాయం చేస్తారు?" అని రుసరుసలాడాడు. పాపం ఆ శ్రేయోభిలాషికి మరొక్కసారి కృతజ్ఞతలు చెప్పి నేను ముందుకు సాగిపోయాను. దైవంపై భారం మోపి కొన్ని ఫర్లాంగులు నడిచాను. ఆ సందర్భంగా నేను అనుభవించిన అనిర్వచనీయమైన భావాలు, భావనలను జీవితంలో ఎన్నడూ మరువలేను.

కంపెనీబాగ్‌లోని వీధిలోనుంచి చాందినీచౌక్‌కు వచ్చి అక్కడి నుంచి ముందుకు సాగిపోతుంటే అక్కడి వాళ్ళంతా నన్ను అవాక్కయి చూస్తున్నారు.

నన్నెవరూ ఏమీ అనలేదు సరికదా! వారి చూపుల్లో పగ, ద్వేషం కూడా నాకు కనబడలేదు. బల్లిమారాన్ మీదుగా ఖాసిమ్ జాన్ స్ట్రీట్‌లోని జమీయత్ ఆఫీసుకు చేరుకున్నాను. ఢిల్లీలో రెండు మూడు రోజులు ఉండవలసి వచ్చింది. తిరిగి వచ్చేటప్పుడు కూడా- స్టేషన్ వరకూ నడిచే వెళ్ళాలని అనుకున్నాను. ఉదయం ఫజ్ర్ నమాజ్ చేసి సామాను మోసే కూలివాణ్ణి వెతికాను. ఆ రోజు ఖాసిమ్‌జాన్ వీధిలోగానీ, బల్లిమారాన్‌లోగానీ కూలివాడు దొరకలేదు, చాందినీచౌక్ వరకూ నడచుకుంటూవచ్చాను. అక్కడ సరిహద్దు రాష్ట్రానికి చెందిన కొంతమంది పఠాను యువకులు కనిపించారు. ఆ సమయంలో ఆ పఠానులను ఆ ప్రాంతంలో చూసి నాకు ఆశ్చర్యం కలిగింది. ఆ రోజుల్లో ముస్లింల పాలిట అది చాలా సెన్సిటివ్ ఏరియాగా భావించబడేది.

అయితే వారిని పలకరించిన మీదట నాకు తెలిసింది- వాళ్లు పెషావర్ జిల్లాకు చెందిన బాధిత హిందువులని! 10 రోజుల క్రితమే వాళ్లు ఢిల్లీ చేరుకున్నారు. చాలా నిస్సహాయస్థితిలో ఉన్నారు. కాందిశీక శిబిరాలలో వారికి లభించే రేషన్‌తో ఒక్కపూట కూడా కడుపునిండదు. 'ఖాసిమ్ జాన్ వీధిలో నా సామాను ఉంది. స్టేషన్ దాకా సామాను మోసేవారు కావాలి' అని నేను వాళ్లతో అన్నాను. "పదండి, మేము సామాను చేరవేస్తాం" అని ఇద్దరు రాబోయారు. 'ఇద్దరు అక్కరలేదు. కొద్ది సామాను మాత్రమే ఉంది. ఒక్క మనిషి వస్తే చాలు' అని నేనన్నాను. "ఫరవాలేదండి. మేమిద్దరం కలిసే ఉంటాము" అని అన్నారా ఇద్దరు. జమీయత్ కార్యాలయానికి వచ్చి సామాను తీసుకున్నారు. ఒక వ్యక్తి సామాను ఎత్తుకున్నాడు. దారిలో నేను వాళ్ల స్థితిగతులను గురించి దర్యాప్తు చేశాను. సామాను మోస్తున్న వ్యక్తి ఇలా చెప్పాడు:

"మేమిద్దరం ఒకే గ్రామస్థులం. నేను పేదవాణ్ణి. కాని నా ఈ మిత్రుడు మాత్రం ఓ శ్రీమంతుని కుమారుడు. ఇప్పుడు మేమిద్దరం ఒకే శిబిరంలో - ఒకే రూములో- ఉంటున్నాము. ఇతను కష్టపడలేడు. నేను కష్టపడి సంపాదించిన దానితోనే ఇద్దరం సర్దుకుంటాం. నాకే బాధ కలిగినా నేను తమాయించుకుంటాను. కాని నా మిత్రుడు పడే బాధను నేను చూసి సహించలేను. మా గ్రామ ముస్లింలు మాకెంతో అండగా ఉన్నారు. పోలీసువాళ్లు వచ్చి మమ్మల్ని ఇతర ప్రాంతానికి

తరలించబోయారు- కాని స్థానిక ముస్లింలు పోలీసులను సయితం ఎదిరించారు. ఒకనాడు రాత్రిపూట అకస్మాత్తుగా సైనిక వాహనం వచ్చింది. బయలుదేరమని సైనికులు మమ్మల్ని పురమాయించారు. గత్యంతరంలేక మేము ఊరు విడువవలసి వచ్చింది. గ్రామస్థులంతా కన్నీటితో మాకు వీడ్కోలు ఇచ్చారు. నా మిత్రుని తండ్రి పంజాబ్‌లోని ఒక ప్రాంతంలో హత్యగావించబడ్డాడు, ఇప్పుడు మేమిద్దరం మిత్రులుగా, సొంత అన్నదమ్ములుగా ఉంటున్నాం."

అతని మాటలు విని నా మనసు బాధతో మూల్గింది. కళ్లు చెమర్చాయి. ఆ బాధిత సోదరులను ఆదుకోవడానికి ఆ సమయంలో నాదగ్గర పెద్ద మొత్తం ఏమీ లేదు. ప్రయాణ ఖర్చులు పోగా మిగిలివున్న డబ్బులన్నీ వారిద్దరికీ సహాయంగా సమర్పించాను. -నిదాయె మిల్లత్ (2-3-2001)

## 59. నిష్పాక్షికమైన తీర్పు

హైదరాబాద్ స్టేట్ పరిధిలోని నాందేడ్ జిల్లాలో ఒక గురుద్వారా విషయంలో ఉద్రిక్తత ఏర్పడింది. ఈ సందర్భంగా నిజాం నవాబు (ఆలా హజ్రత్) జారీ చేసిన 'ఫర్మానా' ఇలా ఉంది-

కొన్నాళ్ల క్రితం నాందేడ్ హిల్స్‌లో ముస్లింలు-శిక్కుల మధ్య అవాంఛనీయమైన ఉద్రిక్తత నెలకొన్నది. ఈ సమస్యను పరిష్కరించడానికి నా ప్రభుత్వం పూనుకుంది. ఇరువర్గాల మధ్య రాజీ కుదుర్చాలనీ, వ్యవహారం అంతటితో సద్దుమణగాలని మేము కోరుకున్నాము. కాని దురదృష్టవశాత్తు మేమాశించినట్లు జరగలేదు. సమస్య సంక్లిష్టంగా పరిణమించింది. అదీగాక ఇటీవల బక్రీద్ పండుగ సందర్భంగా ఇరువర్గాల మధ్య ఏర్పడిన ఉద్రిక్తత పరిస్థితిని మరింత క్లిష్టతరం చేసేసింది. ఈ నేపథ్యంలో నా సలహా మండలి ప్రతిపాదించిన విషయాన్ని బాగా ఆలోచించిన మీదట సమ్మతించాను. ఆ ప్రతిపాదన ఏమిటంటే మాల్‌టేక్రీ (నాందేడ్) సమస్యను నిష్పక్షపాతంగా విచారణ జరిపి న్యాయసమ్మతమైన తీర్పు ఇవ్వడానికిగాను, ఒక పాశ్చాత్య న్యాయమూర్తిని పిలిపించి, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆధ్వర్యంలో ఈ కేసు నడపాలి. న్యాయమూర్తి ఇచ్చిన తీర్పును ఏ ఒక్క వర్గం కూడా త్రోసిపుచ్చకూడదు.

తీర్పును ప్రభుత్వం ఖచ్చితంగా అమలుజరపాలి. ఎవరయినా తీర్పును త్రోసిరాజంటే నా గవర్నమెంటు జోక్యం చేసుకుని కఠిన చర్య తీసుకోవలసి ఉంటుంది.

ఇక నాందేడ్‌లో బక్రీద్ పండుగ సందర్భంగా జరిగిన రెండవ సంఘటన గురించి- ఈ సమస్యను న్యాయస్థానం ద్వారా పరిష్కరించాలని నిర్ణయించ బడింది. ఇరువర్గాలవారు న్యాయస్థానాన్ని ఆశ్రయించి, న్యాయస్థానం ఇచ్చిన తీర్పును శిరసావహించాలి.

ఈ ఏర్పాట్లన్నీ నా ప్రభుత్వం చేస్తున్నది. ఏ ఒక్కవర్గం వైపునకు కూడా మొగ్గకుండా నిష్పక్షపాతంగా న్యాయం చేయడానికి మేము తీసుకునే చర్యలను ఏ ఒక్కరూ తప్పుపట్టడానికి వీల్లేదు. ఈ మేరకు మా ఆదేశాలు కూడా జారీ చేసేశాము. ఈ రెండు కేసులు కూడా మేము సూచించిన విధంగానే పరిష్కారం కాగలవని ఆశిస్తున్నాము. ఇందులో ఎలాంటి తాత్సారం చేయటంగానీ, పక్షపాత వైఖరిని కనబరచటం గానీ జరగదు. ఈ కేసు పూర్వాపరాలను వివరించడానికి ప్రభుత్వ అనుమతితో ఇక్కడికి వచ్చిన మా అతిథి నాందేడ్ గురుద్వారా వ్యవహారాల ఇన్‌చార్జి సర్దార్ సర్ సుధీర్‌సింగ్ మభ్‌టియాను కూడా మా కౌన్సిల్ సంప్రతిం చింది. వివిధ కోణాల నుంచి ఆయనతో సమాలోచన చేయటం జరిగింది. మేము చర్చించిన అంశాల పట్ల బహుశా సర్దార్ సుధీర్‌సింగ్ కూడా ఏకీభావం కలిగి ఉన్నారు. సర్దార్ సుధీర్ నన్ను కలుసుకోగోరగా నేను సయితం ఆయనతో చాలాసేపు ఈ వ్యవహారంపై మాట్లాడాను. ఆయన ఆలోచనలు కూడా మా ఆలోచనలతో సమరసం చెందుతున్నట్లే మాకనిపించింది. ప్రస్తుత పరిస్థితుల్ని సర్దార్‌జీ బాగా అర్థం చేసుకున్నారు. అవసరమైతే మా ప్రభుత్వానికి సర్వవిధాలా సమర్థన ఇవ్వడానికి తాను సిద్ధంగా ఉన్నానని ఆయన హామీ ఇచ్చారు.

ఈమధ్య నాందేడ్‌లో వదంతులు దాహనలంలా వ్యాపిస్తున్నాయని సర్దార్‌జీ ద్వారా తెలిసింది. (ఈ వదంతులు ఎక్కడ, ఎలా పుడుతున్నాయో ఏమో గానీ) నాందేడ్ గురుద్వారాపై దాడి జరగనున్నదనీ, ఈ సంగతి పంజాబ్, అమృత్‌సర్‌లోని శిక్కు సోదరులకు ఆందోళనకరంగా పరిణమించిందనీ మాకు తెలిసింది. గురుద్వారా రక్షణ నిమిత్తం శిక్కులు పంజాబ్ నుండి కొంతమంది

కార్యకర్తలను పంపిస్తున్నారని కూడా తెలియవచ్చింది. ఈ వదంతులపై నేను చెప్పాల్సిందేమిటో సర్దార్‌జీకి చెప్పేశాను. నా సమాధానం శిక్కు సోదరులకు సంతృప్తినిచ్చి ఉంటుందని ఆశిస్తున్నాను. అయితే తన రాజ్య పరిధిలోనున్న అన్ని మతాల వారికి ధన మాన ప్రాణాల రక్షణ కల్పించే బాధ్యత ప్రభుత్వానిదని మరొక్కసారి జ్ఞాపకం చేస్తున్నాను. రాజ్య పాలకులైన నా పూర్వీకులు కూడా దీనికి కట్టుబడి ఉన్నారు. నేను సయితం ఈ మాటకు కట్టుబడి ఉంటాను. నా పూర్వీకుల విధానమే నా విధానం. ఈ ఉద్దేశ్యంతోనే ఒక్క గురుద్వారాను మాత్రమేగాక, ఇతర ఆరాధనా స్థలాలను కూడా రక్షించవలసిన బాధ్యత ఉందని ప్రభుత్వ యంత్రాంగానికి ఆదేశించాను. ప్రస్తుత సమస్యను దృష్టిలో పెట్టుకుని, స్థానిక పోలీసుల ద్వారా గురుద్వారాని రక్షించాలని తాకీదు చేశాను. ఈ ఒక్క వివాదాస్పద విషయమేగాకుండా భవిష్యత్తులో ఎక్కడా, ఎలాంటి అవాంఛనీయమైన విషయం తలెత్తకుండా ఉండాలన్నది నా అభిమతం. ఎందుకంటే ఇలాంటి అవాంఛనీయ ఘటనలు ఒకవైపు ప్రభుత్వానికి శిరోవేదనగా తయారవటమేగాక, మరోవైపు అవి వివిధ వర్గాల ప్రజల మధ్య మనస్పర్థలను సృష్టిస్తాయి. వందేళ్ళ నుండే ఈ రాజ్య పాలకుల పేరు సహనశీలురుగా వినుతికెక్కింది. భవిష్యత్తులో కూడా ఇలాగే కొనసాగుతుందని నేనాశిస్తున్నాను.

-(సం-)(నవాబ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్)

## 60. హసన్‌గంగూ బహమని

బహమనీ రాజ్య స్థాపకుడయిన హసన్‌గంగూ బహమని ముస్లిం అయినప్పటికీ అన్ని మతాలవారిని సమానంగా చూశాడు. పరమతస్థుల పట్ల ఈర్ష్యాద్వేషాలంటే అతనికి గిట్టవు. పరిపాలన వ్యవహారాలలో అతని విధానం ఉభయతారకంగా ఉండేది. న్యాయసంబంధమయిన విషయాల్లో పక్షపాతం సహించేవాడు కాడు. హిందూ ముస్లింలను తన రెండు నేత్రాలుగా చూసుకునే వాడు. పరమతస్తులను ఎన్నడూ చిన్నచూపు చూడలేదతను. సామంత హిందూ రాజుల పట్ల కఠినంగా ఎన్నడూ వ్యవహరించలేదు. హిందూ మత విషయాలలో ఏనాడూ జోక్యం కలుగజేసుకోలేదు. తాము నమ్మిన మత విశ్వాసాలను

అచరించే స్వేచ్ఛ అందరికీ ఉండేది. ఇస్లామీయ విద్వాంసులతో సమానంగా హిందూ పండితులను కూడా సుల్తాన్ ఆదరించేవాడు. వారికి సయితం తన సహకారం అందించేవాడు. ఏనాడూ అతను హిందూ దేవాలయా లకు నష్టం చేకూర్చినట్లు దాఖలాలు లేవు. -మహ్‌బూబుల్ వతన్ నుండి

## 61. మేల్కొలుపు

కొన్నిసార్లు మామూలు సంఘటనలే మహత్ పూర్వకంగా పరిణమిస్తాయి. చిన్న విషయాలే చరిత్రగతిని మార్చివేస్తాయి. కొన్ని రోజుల క్రితం లాహోర్‌లో జరిగిన ఒక సంఘటన అపూర్వమయినది. ఒక సినిమా థియేటర్‌కు ఎదురుగా రోడ్డు ప్రక్కన కారులో కొంతమంది ఆంగ్లో ఇండియన్లు కూర్చొని ఉన్నారు. బహుశా సినిమా చూసివెళుతున్నట్టుంది. అప్పుడే కారు స్టార్టు కాబోతోంది. బురఖా ధరించి ఉన్న ఒక స్త్రీ అటువైపు వస్తోంది. వీళ్ళను చూడగానే ఆమె బిచ్చమడిగింది. సమాధానం రాలేదు. మళ్ళీ మళ్ళీ అడిగింది చేయి చాపి. అందులో ఒక ఆంగ్లో ఇండియన్ చీదరించుకుంటూ "పో, పోయి నీ సోదరులను అడుక్కో" అన్నాడు. అటువైపే వస్తున్న విద్యావంతుడయిన ఒక పంజాబి యువకుని చెవినపడ్డాయి ఈ మాటలు. తక్షణం అతనక్కడ ఆగిపోయాడు.

"నువ్వు ఆమెకు సోదరుడివేగా, ఆమెకు భిక్షమెందుకు వెయ్యవు?" అనడిగాడు. ఆంగ్లో ఇండియన్ అదోరకంగా పగలబడి నవ్వి, 'అదేంటి, మేము ఈవిడకు ఎలా సోదరులమవుతాం?' అని అడిగాడు.

అత్యంత నిదానంగా, దరహాసంతో జవాబిచ్చాడు పంజాబీ యువకుడు.

"మీరూ, మేము ఒకే దేశంలో నివసిస్తున్నాము. బహుశా మీరూ ఇక్కడే పుట్టి ఉంటారు. ఇక్కడే పెరిగి ఉంటారు. మన న్యాయస్థానాలు ఒక్కటే. మన ప్రభుత్వం, దాని సంవిధానం కూడా ఒక్కటే. మనం ఒకే చట్టానికి లోబడి ఉంటున్నాము. మన పరిపాలకుడు ఒక్కడే. ఏ ఆపద వచ్చినా మనమందరం దాని వాతన పడుతున్నాము. మీరు మొదటి ప్రపంచ యుద్ధాన్ని మరువలేదను కుంటాను. దాని మూలంగా ఏర్పడిన ఆర్థిక మాంద్యం వల్లనే మేమెలా

ప్రభావితం అయ్యామో మీరూ ప్రభావితులయ్యారు. ఉద్యోగాల నుంచి మిమ్మల్నీ సమంగా తీసివేస్తున్నారు. మీరూ మేమూ ఒకే సమయాన, సమానంగా నిరుద్యోగ సమస్యకు లోనవుతున్నాము. ఇన్ని విధాల పోలికలున్న తర్వాత మనం పరస్పరం సోదరులమయి ఉండటంలో ఇక సంశయముందా?! మీరు కేవలం ఒక చిన్న విచక్షణ- జాతి విచక్షణ ఆధారంగా యదార్థాన్ని కాదనలేరు' ' ఈ మాటలు ఆంగ్లో ఇండియన్ హృదయ జగత్తును మేల్కొల్పినాయి. ఇద్దరూ కరచాలనం చేసుకుని విడిపోయారు. (భారత సముదాయం-1932, పేజీ: 44)

# 62. ఆప్యాయత

భారతదేశం పేరు విన్నంతనే పాకిస్తానీ వ్యక్తి ఎగిరిగెంతుతాడు. ఎన్నో రోజులకు విడిపోయిన సోదరుణ్ణి కలుసుకోబోతున్నాననే ఆనందానుభూతికి గురౌతాడు. మీరు ఏదైనా హోటల్లో బస చేసినట్లయితే కొత్తగా పరిచయమయిన పాకిస్తానీ మిత్రుడు మిమ్మల్ని బలవంతాన తన ఇంటికి తీసుకెళ్తాడు. మీరు పాకిస్తాన్ వచ్చి హోటల్లో బస చేయడం తనకు నామోషిగా, అప్రదిష్టగా భావిస్తాడు. ఏదైనా దుకాణానికి వెళితే బేరం చేయకుండానే అతి తక్కువ ధరకు ఆ వస్తువుల్ని మీకు ఇవ్వాలని ఆ షాపు యజమాని అభిలషిస్తాడు. ఆ సమయంలో మీ వద్ద పైకం తక్కువబడితే అంతమేరకు మాఫీ చేస్తాడు. టాక్సీలో ప్రయాణిస్తున్నప్పుడు భారత్ నుండి వచ్చిన వ్యక్తులుగా గ్రహించినట్లయితే మిమ్మల్ని బలవంతాన తన అతిథిగా భావిస్తాడు అక్కడి డ్రైవర్. ఇంకా మీకు ఏది అవసరమయితే అది మీ ముందు హాజరుపరుస్తాడు.

ఇప్పటికీ నాకా సంఘటన గుర్తుంది. ఒకసారి తక్షశిల నుండి తిరుగు ప్రయాణంలో దారిలో ఓ చోట ఆగవలసివచ్చింది. నేను శాకాహారిననే విషయం తెలుసుకుని బ్రాహ్మణ భోజనానికి ఆ డ్రైవర్ ఊరంతా గాలించాడు. ఎక్కడా అటువంటి హోటల్ లేకపోవడంతో ఒక హోటల్‌లో ప్రత్యేకంగా శాకాహారి వంటకాలు వండే ఏర్పాటు చేయించాడు. అదే భారత దేశానికి వచ్చిన పాకిస్తానీయునికి ఇలాంటి ఆతిథ్యం ఎక్కడా లభ్యం కాదనుకుంటాను. ఇది ముమ్మాటికీ చేదు వాస్తవం. -'సరిత' మాసపత్రిక, కొత్త ఢిల్లీ, అక్టోబరు, 1962

# 63. ప్రభుత్వ బాధ్యత

తన రాజ్య పరిధిలో నివసించే వివిధ వర్గాల ప్రజల మధ్య సామరస్య పూర్వకమైన వాతావరణాన్ని నెలకొల్పటంలో ఆసఫియా (నిజాం) పరిపాలకులు సాటిలేనివారు. రాజ్యపరిధిలో ఉండే వివిధ మతాలవారు, హిందూమతంలోని వివిధ కులాల, తెగలవారు నిశ్చింతగా జీవితం గడిపేవారు. యూదులు, క్రైస్తవులు, పారసీకులు కూడా ఉండేవారు. నిజాం రాజ్యంలో ఈ అన్ని వర్గాల వారి మనోభావాలు, నమ్మకాలకు ఆదరణ ఉండేది. వారి మధ్య ఎలాంటి మనస్పర్థలు, అరమరికలు ఏర్పడకుండా ఉండేలా జాగ్రత్తలు తీసుకోబడేవి. ఒక తెగవారు మరో తెగవారిని కించపరచకుండా ఉండేలా ప్రభుత్వం గమనిస్తూ ఉండేది. మత వ్యవహారాల విభాగం ఎప్పటికప్పుడు పరిస్థితులను బేరీజువేస్తూ ఇటు రాజ్యపాలకులను, అటు పోలీసు యంత్రాంగాన్నీ అప్రమత్తం చేస్తూ ఉండేది.

ఇదిలా ఉండగా గుల్బర్గాలో జరిగిన మతకల్లోలం పరిపాలనా యంత్రాంగానికి పెద్ద సవాలుగా పరిణమించింది. ఒక ఊరేగింపు విషయంలో హిందూ-ముస్లింలకు మధ్య అవాంఛనీయ స్థితి ఏర్పడింది. ఇరువర్గాలకు చెందిన కొంతమంది ఆవేశపరుల అవివేకం వల్ల చిన్న విషయం కాస్తా చిలికి చిలికి గాలివానగా మారింది. అనేకమంది గాయపడ్డారు. ఒక పోలీసు అధికారి మృత్యువాతన పడ్డాడు. మస్జిదులకు, దేవాలయాలకు నష్టం వాటిల్లింది. వెంటనే పోలీసులు, సైన్యం రప్పించబడ్డాయి. శాంతి భద్రతల పరిస్థితి అదుపులోకి వచ్చింది. విచారణ నిమిత్తం ఒక హిందూ, మరో ముస్లిం అధికారి నియమించబడ్డారు. విచారణ సంఘానికి సాయపడేందుకు డిప్యూటీ పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ పంపబడ్డారు. ఈ కలహం వల్ల మస్జిదులకు, దేవాలయాలకు జరిగిన నష్టాన్ని ప్రభుత్వం స్వయంగా పూరిస్తుందని, ప్రభుత్వమే మరమ్మత్తు పనులు చేపడుతుందని ప్రకటించబడింది.

హిజ్రీ 1343 జమాదివుల్ ఆఖిర్‌లో ప్రభుత్వం తరఫున ఈ ఫర్మానా కూడా వెలువడింది.

"మత ఊరేగింపుల సందర్భంగా రాజ్యపరిధిలో హిందూ-ముస్లింల మధ్య తరచూ ఉద్రిక్తత ఏర్పడుతున్నది. ఒక్కోసారి పరిస్థితి అదుపుతప్పి మత కలహంగా కూడా మారుతోంది. దీన్ని నిరోధించడానికిగాను ఒక కమీషన్ నియమించబడుతున్నది. ఇందులో మత వ్యవహారాల విభాగం తరపున నవాబ్ అఖ్తర్ యార్ జంగ్, న్యాయస్థానం తరపున రాయ్‌బాల్ ముకుంద్ (హైకోర్టు), ఆర్థిక శాఖ తరపున మౌల్వీ సయ్యద్ అహ్మద్ ఖాద్రి ఉంటారు. ఈ ముగ్గురూ కల్లోలిత ప్రాంతాలలో పర్యటించి తమ నివేదికను సమర్పిస్తారు. ఊరేగింపులు ఎప్పుడు, ఎక్కడ జరుగుతాయి, ఎక్కడెక్కడ పరిస్థితి అదుపు తప్పుతోంది- తదితర వివరాలను ఆ నివేదిక ద్వారా తెలుసుకుని కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేయబడతాయి. ఇరు మతాల ఉత్సవాలు ఒకేసారి వస్తే అట్టి పరిస్థితిలో అసాధారణమైన గజెటు ద్వారా ఆదేశాలు జారీ చేయబడతాయి."

ఈ సూచనానుసారం కమిటీ జిల్లాలలో పర్యటనను మొదలెట్టింది. ఔరంగాబాద్, నిజామాబాద్, మహబూబ్‌నగర్, నల్గొండ జిల్లాలలో దర్యాప్తు పని ముగిసింది. అంతలోనే రాయ్‌బాల్ ముకుంద్ గుండెపోటుతో మరణించారు. ఈయన స్థానంలో రాజా బహదుర్ పండిట్ గిరిరావు నియమించబడ్డారు. వరంగల్, బీదర్, ఉస్మానాబాద్ జిల్లాల పని ముగిసేసరికి ఈయన ఉన్నత న్యాయస్థానంలో సభ్యునిగా నియమితులయ్యారు. కొత్తగా రాయ్ రూప్‌లాల్ వచ్చారు. గుల్బర్గా జిల్లాకు చెందిన జతోల్ వికారాబాద్ పర్యటనలో పాల్గొన్నారు. ఆయన మరణించిన తరువాత నర్సింగ్ రాజ్ బహదుర్ ఆ స్థానంలో కొత్తగా వచ్చారు. ఈయన కరీంనగర్, అలంద్‌ల పర్యటనలో పాల్గొన్నారు. ఈ విధంగా సంవత్సరాల తరబడి ఈ కమీషన్ జిల్లాలలో విస్తృతంగా పర్యటించింది. 225 స్థానాలు తనిఖీ చేయబడ్డాయి. మత ఊరేగింపుల మార్గాలు పరిశీలనలోకి వచ్చాయి. ప్రభుత్వ కార్యాలయాల రికార్డులు తిరగవేయబడ్డాయి. పటేల్ పట్వారీలను దర్యాప్తు చేయటం జరిగింది. స్థానిక ప్రముఖులతో సంప్రతింపులు జరిగాయి. ఒక్కో ఊరేగింపు తేదీలు, ఊరేగింపు రూట్లకు సంబంధించిన వివరాలే సేకరించబడ్డాయి. రూటు మ్యాపులు కూడా సేకరించబడ్డాయి. ఉద్రిక్తత నెలకొని ఉన్న చోట్ల ఇరువర్గాల వారిని సంప్రతించి సమస్యను

శాంతియుతంగా పరిష్కరించటం కూడా జరిగింది. ఆ తరువాత కమిటీ తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది.

## 64. సర్వే లెక్కల ప్రకారం

సర్కారె ఆలీ (నిజాం పరిపాలన) అజమాయిషీలో వున్న ప్రాంతాలలో చర్చీలు గాకుండా దాదాపు 50 వేల మత సంస్థలున్నాయి. వాటిలో 34,509 హిందువులకు సంబంధించినవి. 14,777 ముస్లిములకు చెందినవి. వీటిలో 32,000 దేవాలయాలు, 6,000 మస్జిదులు కూడా ఉన్నాయి.

ప్రభుత్వ ఖజానా నుండి సాలీనా 1,12,870/- రూపాయల నగదు హిందువుల సంస్థలకు ఇవ్వబడుతున్నాయి. అలాగే హిజాజ్ (మక్కా, మదీనా లకు)తో పాటు ముస్లిం సంస్థలన్నింటికీ రూ. 7,87,938/- కేటాయించబడ్డాయి. చర్చీలకు 18,829/- లభించేవి. ఇవిగాక 11,355 హిందూ సంస్థలకు, 5,042 ముస్లిం మత సంస్థలకు ప్రభుత్వ సాయం ఇవ్వబడుతున్నది. అంతేగాక హిందూ ముస్లిం సంస్థలకు పెద్ద పెద్ద జాగీర్లు కూడా ఇవ్వబడ్డాయి. ఉదాహరణకు హైదరాబాదులోని సీతారాంబాగ్‌లో వున్న దేవాలయానికి సాలీనా 50 వేల రూపాయలు, ఆదిలాబాద్ (మాహూరీ)లో వున్న సఫుర్ దేవాలయానికి 60 వేల రూపాయలు ఈ జాగీర్ల ద్వారా ఆదాయం వస్తుంది. నాందేడ్‌లోని సిక్కుల గురుద్వారాకు ప్రభుత్వ కానుకల ద్వారా లభించే ఆదాయం ఏటా 23,563/- రూపాయలు. వాస్తవానికి ప్రభుత్వ అజామాయిషీలో వున్న ప్రాంతాలలోని దేవాలయాలన్నింటికీ ఎంతో కొంత మొత్తం సహాయంగా లభిస్తూనే ఉంది. రాజ్యపరిధిలోకిరాని భద్రాచలం దేవాలయానికి సయితం సాలీనా 20 వేల రూపాయలు ఇవ్వబడుతున్నాయి.

1925-40 మధ్య కాలంలో 176 కొత్త దేవాలయాల నిర్మాణానికి, 985 దేవాలయాల మరమ్మత్తు మరియు విస్తృతికి అనుమతి ఇవ్వబడింది. గుల్బర్గాలోని కొన్ని మందిరాల మరమ్మత్తు నిమిత్తం 25 వేల రూపాయలు మంజూరు చేయ బడ్డాయి. శరణు బసవప్పా దేవాలయం కూడా ఇందులో ఉంది.

గ్రామాలలోని 90 శాతం పటేల్ పట్వారీలు హిందువులే. వారు తమ తమ ప్రాంతాలలో మతాధికారులుగా చెలామణి అవుతున్నారు. ఆసక్తికర మయిన ఇంకో విషయం ఏమిటంటే దాదాపు 125 మస్జిదులు, దర్గాలు, హిందువుల ఆధ్వర్యంలో ఉన్నాయి. వాటి నిర్వహణకయ్యే ఖర్చులను వారు ప్రభుత్వం నుండి పొందుతున్నారు.

('హైదరాబాద్‌లోని సుప్రసిద్ధ ప్రార్థనా స్థలాలు' - హైదరాబాద్ ప్రభుత్వ ప్రచురణ)

## 65. ప్రాణాలను పణంగా పెట్టి....

గత కొన్ని నెలల క్రితం భారత దేశంలోని తూర్పు ప్రాంతాలలో జరిగిన మత కలహమనే ఏకపక్ష ముస్లిం మారణకాండ మానవతా ప్రేమికులను కలచివేసింది. జయప్రకాశ్ నారాయణ్, బాబూ నాబా కృష్ణచౌధరి (ఒరిస్సా మాజీ ముఖ్యమంత్రి) తదితర ప్రముఖులు, సహృదయులైన హిందువుల రక్తకన్నీరును ప్రవహింపజేసింది. ఆంగ్లో ఇండియన్ నాయకుడు మిస్టర్ ఫ్రాంక్ ఆంథోనీ ఎంతగా కలత చెందాడో పార్లమెంటులో అతను చేసిన వ్యాఖ్య ద్వారా వ్యక్తమవుతోంది. అతనిలా అన్నాడు: "ప్రస్తుతం భారతదేశంలో ముస్లింలు మృత్యు నీడలో మనుగడ సాగిస్తున్నారు"- ఇలాంటి నరమేధం, భారత దేశ ముస్లింలలో తీవ్రమయిన విశ్వాస రాహిత్యాన్ని, అసంతృప్తిని జనింపజేసింది.

అయితే ఇలాంటి నికృష్ట ఘడియలలో, అమానుష పరిస్థితులలో కూడా కొంతమంది సహృదయులైన హిందువులు, మానవతా మూర్తులు అంధకారంలో కాంతికిరణంలా ముందుకువచ్చారు. అటువంటి వారిలో బాబూ ఆగమ ప్రసాద్ వర్మ ఒకరు. ఈయన రూర్కెలా సమీపంలోని జరైకెలా గ్రామవాసులు. హిందూ ప్రముఖులలో ఒకరు. మర్యాదస్తులు. గ్రామ సర్పంచ్ కూడాను. ఈ గ్రామం రూర్కెలా పట్టణానికి 21 మైళ్ళ దూరంలో ఉంది.

మత కలహాలలో ముస్లింలకు జరిగిన ధన ప్రాణ నష్టాన్ని అంచనా వేయడానికి, బాధిత ముస్లింలను పలకరించడానికి మేము రూర్కెలా, జంషెడ్పూర్ పట్టణాలను సందర్శించినప్పుడు, ముస్లింలను రక్షించడానికి ముందుకు వచ్చిన హిందూ సోదరులను కూడా కలుసుకున్నాము.

బాబూ ఆగమ ప్రసాద్ వర్మ సేవలను గురించి రూర్కెలాలో విన్నంతనే మేము ఆయన్ని కలుసుకోవాలన్న కుతూహలాన్ని వ్యక్తపరిచాము. ఆ రోజు సాయంత్రమే అక్కడికి వస్తారని ఎవరో చెప్పారు. మేమాయన్ని కలుసుకోవాలనుకుంటున్నామని తెలుసుకుని ఆయన స్వయంగా మా వద్దకు వచ్చారు. ఆయన ద్వారా రక్షించబడిన కొంతమంది ముస్లిం సోదరులు కూడా ఆయన వెంట ఉన్నారు. వారిలో అబ్దుల్ ఖాదిర్ ఒకరు. మేము అడిగిన కొన్ని ప్రశ్నలకు సమాధానంగా బాబూ ఆగమ ప్రసాద్ వర్మగారు, అబ్దుల్ ఖాదిర్‌గారు చెప్పినదంతా ఇక్కడ పొందుపరుస్తున్నాము.

ఆగమ ప్రసాద్‌గారు ఇలా అన్నారు: మత కలహం మొదలవక 8, 9 రోజుల ముందు నేను మార్చి 13వ తేదీన రూర్కెలా వచ్చాను. ఇక్కడి హిందూ సోదరులు, శిక్కులు చెప్పుకుంటున్నదాన్ని బట్టి వీళ్ల ఆలోచనలు ముస్లింలకు వ్యతిరేకంగా సాగుతున్నాయని అర్థం చేసుకున్నాను. వాళ్లకు నచ్చజెప్పడానికి చాలా ప్రయత్నించాను. కాని నా మాటల ప్రభావం వారిపై ఏమీ పడలేదు.

ఆ తరువాత మార్చి 18,19 తేదీలలో, ఫలానా చోట ముస్లింలపై దాడి జరిగిందనీ, ఫలానా ఊళ్ళో మరొక దాడి జరగబోతోందనీ వదంతులు పుట్టాయి. ఈ వదంతుల మూలంగా మా ఊళ్ళోని ముస్లింలు సహజంగానే ఆందోళన చెందారు. వాళ్ళు నన్ను సంప్రతించారు. నేను వాళ్లందరికీ ధైర్యం చెప్పాను. మీకేదన్నా ఆపదవస్తే మేమంతా ఉన్నాం కదా! అని ఓదార్చాము. అయితే మరో వైపు వదంతులు దావానలంలా వ్యాపించసాగాయి. ముస్లింల భయాందోళనలు హెచ్చవసాగాయి. 20వ తేదీన నేను రూర్కెలా వచ్చాను. అక్కడ పరిస్థితి విషమించింది. ఇళ్లకు, దుకాణాలకు కొందరు నిప్పంటిస్తున్నారు. ఈ పరిస్థితిని చూచి నేను పట్టణంలోకి వెళ్ళే బదులు స్టేషన్ నుంచే వెనక్కితిరిగాను. ఇప్పుడు ఆలోచనంతా మా గ్రామ ముస్లింల భద్రత గురించే. వాళ్ళెక్కడ బెదిరిపోతారోనన్న ఉద్దేశ్యంతో నేను వారికి రూర్కెలా కలహాల గురించి ఏమీ చెప్పలేదు. అయితే నేను పోలీసు అధికార్లను సంప్రతించాను. వాళ్లు నాకు అభయమిచ్చారు. కాని వదంతులు మాత్రం అదే పనిగా వ్యాపిస్తున్నాయి. ఫలానా చోట ముస్లింలపై దాడి జరిగిందనో, ఫలానా చోట వాళ్లందరినీ తుదముట్టించటం జరిగిందనో రకరకాల పుకార్లు వినవస్తున్నాయి. దీంతో నేనెంతో కలత చెందాను....

ఇంతలో అబ్దుల్ ఖాదిర్‌గారు మాటందుకున్నారు...... 23వ తేదీ వరకూ మా ఊళ్లో పెద్ద అవాంఛనీయ సంఘటన ఏదీ జరగలేదు. అయితే అనుమానితులైన కొంతమంది చేష్టలు ప్రమాదాన్ని సూచిస్తున్నాయి. 24వ తేదీ ఉదయం వాతావరణమంతా ఎంతో గంభీరంగా ఉంది. దుకాణాలన్నీ మూసేసి ఉన్నాయి. ముందునుంచే మేము అనుమానిస్తున్న వారు ఇళ్లల్లోకి వెళుతున్నారు. ఆయుధాలతో బయటికి వస్తున్నారు. ఈవాళ ఏదో విపత్తు ముంచుకొస్తుందని మాకనిపించింది. మిలటరీ వాళ్లకి ఫోన్ చెయ్యమని మేము ఆగమ బాబుగార్ని కోరాము. వారు ఫోన్ చేశారు. కాని ఫోన్ పలకలేదు.

11 గంటల సమయం....... మా మిత్రులైన ముహమ్మద్ అలీ దగ్గర నౌకరుగా పనిచేసే ఒక విశ్వాసపాత్రుడైన హిందూ సోదరుడు వచ్చి జరగబోయే ప్రళయం గురించి రహస్య సందేశం ఇచ్చాడు. అతనిలా అన్నాడు: "అయ్యా! మేము మీ ఉప్పుతిన్నాము గనక అసలు విషయం చెప్పేస్తున్నాము. ఈ రోజు పాడోడి మార్కెట్టు (జరైకెలాకు నాలుగు ఫర్లాంగుల దూరంలో ఉంది) కొంతమంది పోగై ఉన్నారు. నేనూ అక్కడే ఉన్నాను. సారా తాగిస్తున్నారు. ఆదివాసీలకు డబ్బులు పంచుతున్నారు. పెట్రోలు, కిరసనాయిలు సేకరిస్తున్నారు. ఈ రోజు మధ్యాహ్నం రెండు గంటలకు ముస్లింలపై దాడి జరపాలని ముహూర్తం నిశ్చయమైంది. ఒక్క పసికందు కూడా మిగలకుండా అందరినీ మట్టుపెట్టాలని ప్లాన్ చేస్తున్నారు. ఒకవేళ ఈ పథకంలో ఏ హిందువైనా అడ్డొస్తే అతన్ని సయితం అడ్డుతొలగించుకోవాలని చెప్పుకుంటున్నారు. అందుకే మీరు ఎక్కడికైనా వెళ్ళిపోవటం మంచిది."

మేము స్టేషన్‌కెళ్ళి ఫోన్ చేశాము. ఈసారి ఫోన్‌కి రెస్పాన్స్ లభించింది. అక్కడి నుంచి మేము సరాసరి బాబూ ఆగమ ప్రసాద్ వర్మ గారింటికి వెళ్ళాము. ఆయనెంతో దిగులుగా కూర్చుని ఉన్నారు. కొద్ది సేపట్లోనే మనోహర్‌పూర్ నుంచి ఒక పోలీసు వ్యాన్ వచ్చింది. ఆ వ్యానులో మెజిస్ట్రేట్‌తోపాటు నలుగురు ఆర్మీ జవాన్లు కూడా ఉన్నారు. పరిస్థితుల స్వరూపాన్ని మేము మెజిస్ట్రేట్ గార్కి విడమరచి చెప్పాము. అప్పటికప్పుడే మెజిస్ట్రేట్‌గారు పాడోడి బజార్‌కు చెందిన 'ముఖ్య'కు కబురంపారు. "మేము ఇప్పుడు మాత్రం రాలేము. తరువాత

వస్తాము" అని ముఖ్య నుంచి జవాబు వచ్చింది. అక్కడి పరిస్థితినంతటినీ పోలీసులు వివరించారు. మెజిస్ట్రేటు స్వయంగా ఆగమ ప్రసాద్‌ను వెంటబెట్టుకుని అక్కడికెళ్ళారు. ఊళ్లోని ముస్లింలంతా ఆగమ ప్రసాద్ గారింటికి వచ్చేయాలని మేము నిర్ణయించుకున్నాము. ఊళ్లో ముస్లింల ఇళ్లు మొత్తం 16 ఉన్నాయి. చిన్నలు పెద్దలందరూ కలుపుకుని 80 మంది దాకా ఉంటారు. ఉన్నపళంగా బయల్దేరి ఆగమ బాబు ఇంటికి వెళ్ళమని మా ఆడవాళ్ళను పురమాయించాము. ఇల్లు చాలా దూరమే. అయినా చిన్న పిల్లలను ఎత్తుకుని ఆగమ బాబు ఇంటికి పరుగులు తీశాము. మేము అలా వెళ్ళటం ఒక అల్లరిగుంపు కంటపడింది. వాళ్లు మమ్మల్ని వెంబడించారు. మా అంతిమ ఘడియలు దాపురించాయనే అనిపించింది. మేము రైలు పట్టాలు దాటాము. అంతలోనే దైవవశాత్తు ఒక గూడ్సు బండి వచ్చింది. అది చాలా పొడవుగా ఉంది. అందువల్ల ఆ అల్లరిమూక రైలు పట్టాలను త్వరగా దాటలేక పోయింది. ఈలోగా మేము అందరం సర్పంచ్‌గారింట్లోకి ప్రవేశించాము. అల్లరి మూకలు వెంటాడుతూ వచ్చాయి. కాస్సేపు మెజిస్ట్రేట్ గారు ప్రతిఘటించారు. కాని క్షణక్షణం అక్కడికొచ్చే ముష్కరుల సంఖ్య పెరుగుతూనే ఉంది. చివరకు వాళ్లు నలువైపులనుంచీ ఆగమ బాబు ఇంటిని చుట్టుముట్టారు. ఆగమ బాబు తన రివాల్వర్ పట్టుకుని ఇంటి కప్పుకెక్కారు. తన దగ్గరున్న తుపాకీ ఒకదాన్ని నాకిచ్చారు. ఒకవైపు నుంచి ఆగమ బాబు, మరో వైపునుంచి మెజిస్ట్రేట్ గారు ఎంత నచ్చజెప్పినా వాళ్లు వినటం లేదు. మాకు ముస్లింలను అప్పగించే వరకూ వెళ్ళేది లేదని ఆవేశంతో ఊగిపోతున్నారు. ఆగమ బాబును నోటికొచ్చినట్టు తిడుతున్నారు. ఇంటికి నిప్పుపెడతామని బెదిరిస్తున్నారు. మీరేగనక ఈ దుశ్చర్యకు పూనుకుంటే ప్రాణాలు దక్కవంటూ ఆగమబాబు రివాల్వర్ గురిపెట్టారు. ఈలోగా మతోన్మాదులు మా ఇళ్లలోకి జొరబడి దోచు కున్నారు. ఇళ్లకు నిప్పంటించారు. మెజిస్ట్రేట్‌గారు ఆగమ బాబును కిందికి పిలిచి ఏదో మాట్లాడారు. ఆ తరువాత మెజిస్ట్రేట్‌గారు మమ్మల్ని ఉద్దేశ్యించి, "ఇక మీరంతా ఇక్కడుండటం శ్రేయస్కరం కాదు. ఇంతపెద్ద అల్లరిమూకను మేము అదుపు చెయ్యలేము. కాబట్టి మీరంతా మిలటరీ క్యాంపుకు వచ్చేసేయండి. రెండు మూడు ట్రిప్పుల్లో మిమ్మల్నందరినీ అక్కడికీ తరలిస్తాము" అని అన్నారు. ఈ సలహా మాకు

నచ్చులేదు. ఈ వ్యానును మతోన్మాదులు అడ్డుకోకుండా ఉంటారని గ్యారంటీ ఏమిటీ? అయినా గత్యంతరంలేక మెజిస్ట్రేట్‌గారి సూచనకు తలూపవలసి వచ్చింది. మేము ఆడవాళ్లను, చిన్న పిల్లలను వ్యానులో కూర్చోపెట్టాము. ఏడ్పులు, ఆర్తనాదాలు చేస్తూ వాళ్లు వ్యాను ఎక్కారు. అంతలోనే మిలటరీ ఫోర్సు వచ్చేసింది. వ్యాను ఆపి ఎక్కడికెళుతున్నారని మిలటరీ వాళ్లు దర్యాప్తు చేశారు. జరిగినదంతా వాళ్లముందు ఏకరువు పెట్టడం జరిగింది. మిలటరీ వాళ్లు ఆ వ్యాను వెనక్కి తిప్పారు. తక్షణం మిలటరీ జవాన్లు తమ కార్యక్రమంలో నిమగ్నులైపోయారు. అల్లరిమూకల్ని ఉద్దేశ్యించి, మీ దగ్గరున్న ఆయుధాలను వెంటనే క్రిందపెట్టి చేతులెత్తవలసిందిగా ఆదేశించారు. తమ ఆర్డర్‌ను పాటించకపోతే తుపాకీ గుళ్లకు ఆహుతి కావలసివస్తుందని వార్నింగ్ కూడా ఇచ్చారు. అల్లరిమూకలు తమ తమ దగ్గరున్న కత్తులు కటార్లను, బరిసెలను విల్లంబులను నేలపై ఉంచి చేతులెత్తారు. పరిస్థితి అదుపులోకొచ్చేసరికి మూడుగంటలు పట్టింది. గొడవకు సూత్రధారులైన ఐదుగురు తలబిరుసు రౌడీలను అరెస్టు చేశారు. రెండు రోజుల అనంతరం- మార్చి 27వ తేదీన మమ్మల్నందర్నీ మిలటరీ పర్యవేక్షణలో రూర్కెలా క్యాంపుకు చేర్చటం జరిగింది.

-మౌలానా మంజూర్ నోమానీ

# 66. న్యాయదృష్టి

ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటి, శ్రీమతి ఇందిరాగాంధీ అధ్యక్షతన 'జాతీయ సమైక్యతా మండలి' నొకదాన్ని ఏర్పాటు చేసింది. దాని సంక్షిప్త నివేదికలో 'మండలి' ఈ విధంగా పేర్కొన్నది.

"కాంగ్రెస్ సంస్థ ఆచరణా విధానం అల్పసంఖ్యాకుల విశ్వాసాన్ని చూరగొనేదిగా ఉండాలి. అప్పుడే వారు, వారి హక్కుల పరిరక్షణకై దాని వైపునకు మరలి వస్తారు. అందుకు కాంగ్రెస్‌లోని అధిక సంఖ్యాక వర్గం, మైనారిటీల సమస్యలు, ఇక్కట్లపై దీక్షగా దృష్టి సారించాలి. లేకపోతే ఒకే వర్గపు నాయకత్వాన్ని ప్రోత్సహించినట్లవుతుంది. పర్యవసానంగా పరిస్థితి భయానకంగా తయారవుతుంది.

"దేశంలోని రాజకీయ పార్టీలు మైనారిటీలలోని వ్యక్తులను జాతీయ నాయకులుగా మలిచే విషయంలో తగిన చర్యలు తీసుకోవడం లేదు. కాబట్టి నేడు మైనారిటీలకు పార్లమెంటులో, రాష్ట్ర శాసనసభల్లో, స్థానిక సంస్థలలో ఇంకా ఇతరేతర ప్రాతినిధ్య సంస్థల్లో కూడా తగినంత ప్రాతినిధ్యం కల్పించటం అత్యావశ్యకం. మరో విషయం, పాఠ్యాంశాల విషయంలో కూడా రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్ర ప్రభుత్వం స్పష్టమయిన మార్గదర్శక సూత్రాలు పంపాలి. పాఠ్య పుస్తకాల్లో ఏ మత వర్గపు భావావేశాలను కూడా గాయపరచే ధార్మిక పాఠాలు ఉండకుండా జాగ్రత్త వహించాలి." (20 మే, 1961, 'అల్ జమిఅత్' సౌజన్యంతో)

# 67. సహజీవనం

స్వధర్మాన్ని సవ్యంగా ఆచరించడం, పరధర్మాలకు హాని తలపెట్టకుండా, వాటిని చెడుగా ప్రస్తావించకుండా ఉండటం, మా విశ్వాసాలకు మూలస్థంభం. విశ్వాసపరమయిన వైరుధ్యాలున్నప్పటికీ వాటిపట్ల మనం సంపూర్ణ సదవగాహన కలిగి ఉండాలి. మత విషయాలను పూర్తిగా గౌరవించాలి. ఈ బోధన స్వయంగా మన మతంలోనే ఉంది. అది మంచి వైపునకు దారిచూపుతుంది. దైవ ప్రియుడయిన అశోకుడు సైతం ధర్మ ప్రచారంకంటే మించిన సౌభాగ్యం మరొకటి లేదని భావిస్తున్నాడు. ప్రతి మతం మూల సిద్ధాంతం కూడా ఇదే.

(అశోక శాసనం- 12, భారత సంస్కృతి- పేజి:285)

# 68. ఏమిటీ రహస్యం?

మన దేశం శక్తిమంతం అవడంలో గల రహస్యం ఏమిటి? దీన్ని ఇనుమడింపజేయడంలో గల మూలపదార్థాలేమిటి? ఒకటి, మన భౌగోళిక స్వరూపం; రెండు, చారిత్రక మూలాలు; మూడు, కొన్ని ప్రత్యేక ఆశయాల సాధన- ఈ మూడు అంశాలు మన ఐకమత్యంలో ప్రముఖ పాత్ర నిర్వహిస్తున్నాయి.

భౌగోళికంగా చూస్తే భారతదేశాన్ని ఉత్తరాన హిమాలయాలు దిగువన మూడువైపులా సముద్ర జలాలు చుట్టుముట్టి ఉన్నాయి. అందుచేత ఈ ప్రాంతంలో నివసించే వారు - రంగు, జాతి, మతాలకు అతీతంగా - ఒకే దేశ ప్రజలుగా అలరారుతున్నారు. ప్రాచీన కాలంలోనూ దేశ ఐకమత్యపు ఈ భావన కానవచ్చేది. మహాభారత పోరాటాన్ని మీరు అధ్యయనం చేస్తే కురుక్షేత్రంలో ఉత్తర దక్షిణ ప్రాంతాల వారు దర్శనమిస్తారు.

చారిత్రక కోణం నుండి ఆలోచిస్తే భారత సమాజంలో విభిన్న మతాలు, విభిన్న జాతులు, విభిన్న భాషల ప్రజలు కలసిమెలసి ఉంటున్నారన్న యదార్థం తెలిసివస్తుంది. ఎవరూ మరొకరి కంటే ఎక్కువ తక్కువ అనే ప్రశ్నే తలెత్తలేదు. ప్రజలంతా కలసిమెలసి ఉండాలి, ఎవరి మత విశ్వాసాన్నీ అంతమొందించ రాదన్నదే అందరి ఆశయంగా ఉండింది. పైగా వివిధ విశ్వాసాల మధ్య సామరస్యాన్ని, సౌమనస్యాన్ని సృష్టించాలన్న భావన ఆనాడు కలిగేది.

ఏ మార్గానికి మన దేశంలో అడ్డులేదు. సత్యాన్ని స్వీకరించే విధానం, ప్రతి మతంలోని మంచిని గ్రహించే సద్భావన మన దేశంలో ఆది నుండే ప్రబలి ఉండేది. దీనికి చరిత్రే సాక్షి! ఇది మన ఆధ్యాత్మిక దృక్పథానికి ఆలోచనా విస్తృతికి ప్రతీక. దివ్యఖుర్‌ఆన్‌లోను మీకు ఇలాంటి విషయాలే కనిపిస్తాయి. ఖుర్‌ఆన్ మానవాళిని సంబోధిస్తూ, "ప్రజలారా! మేము మిమ్మల్ని ఒకే మానవుని జంట ద్వారా పుట్టించాము. మీ మధ్య పరస్పర పరిచయం కొరకు (పరస్పర ద్వేషం కొరకుకాదు) మిమ్మల్ని జాతులు, తెగలుగా రూపొందించాము" అని ప్రబోధించింది.

ధర్మాలు, విశ్వాసాల సామరస్య ప్రభావం కూడా మన ఏకత్వంపై ఉంది. మనం ఈ వైఖరినే చరిత్ర అంతటా అవలంబించాము.

అశోక చక్రవర్తి సుదూర దేశాలకు బౌద్ధ ధర్మ ప్రచారకులను పంపాడు. ఆయన, 'ఐక్యమత్యం ఒక మహోన్నత లక్షణం' అన్న శిలాశాసనాలు చేయించాడు. చైనా యాత్రికుడు పాహియాన్ భారత దేశంలో పదేళ్ళపాటు పర్యటించి ఇక్కడి మత సహనంతో ఎంతో ప్రభావితుడయ్యాడు. అక్బర్ చక్రవర్తినే చూడండి,

అతడు విస్తృత స్థాయిలో సహిష్ణుతా భావాన్ని, కులమత వ్యత్యాసం లేకుండా అందరికీ న్యాయాన్ని, అన్ని వర్గాల ప్రజల ప్రయోజనాన్ని సాధించే విధానాలను ఆచరించాడు. - డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ (1961, ఢిల్లీలో జరిగిన జాతీయ సమైక్యత సదస్సులో చేసిన ప్రసంగం)

## 69. పవిత్ర భావన

1920లో సిమ్లాలో జరిగిన హిందూ-ముస్లిం ఐక్యతా సదస్సుకు భోపాల్ పాలకురాలైన సుల్తాన్ జహాఁబేగం పంపిన సందేశం-

వార్ధక్యంలో బరువు బాధ్యతలన్నింటి నుంచి విముక్తినొంది సమయాన్నంతా దైవారాధనలో గడపాలని మనిషి కోరుకోవటం సహజం. ఈ కోరిక వల్లనే నేను ఏడాదిన్నర క్రితం రాజ్యపాలనాధికారాన్ని నా ప్రియ కుమారునికి (ప్రస్తుత భోపాల్ సంస్థానాధీశునికి) కట్టబెట్టాను. అయితే నేను ఎంతగానో కోరుకున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నాకు ప్రాప్తించలేదు. దేశంలో ఒక మూల నుంచి మరో మూల వరకు హిందూ-ముస్లింల మధ్య ఏర్పడి ఉన్న అపార్థాల వాతా వరణాన్ని చూసి నా మనసు కలత చెందింది. హిందూ-ముస్లింల మధ్య సౌభ్రాత్రతా భావన కొరవడుతున్నట్లు దేశంలో రోజు రోజుకూ ఘర్షణలు పెరుగుతున్నట్లు పత్రికల్లో చదివి నేనెంతో కుమిలిపోయాను. జీవితంలో ఎన్నడూ ఇంతగా నేను బాధపడలేదు. పరస్పర అంతర్యుద్ధ పరిస్థితి వల్ల పొడసూపుతున్న పరిణామాలు ఎంతో ఆందోళన కలిగిస్తున్నాయి. వార్ధక్య భారంతో కాలం వెళ్ళదీస్తున్న నాలాంటి ముసలావిడ గొడవపడుతున్న ఈ రెండు ప్రధాన వర్గాల మధ్య సామరస్యాన్ని ఎలా సృజించగలదూ? అని ఆలోచిస్తూ ఉండేదానిని. అయితే ఆగస్టు 19వ తేదీనాటి - హృదయాన్ని కదిలించే- ప్రసంగం (సిమ్లా సదస్సులోని ప్రసంగం) చదివిన తరువాత భోపాల్ శాసనమండలిలో నా ప్రియ పుత్రుడు వెలిబుచ్చిన అభిప్రాయాలను విన్న తరువాత నాకు ధైర్యం వచ్చింది. నా సోదరులు బాగోగుల కోసం ఈ సమస్యకు పరిష్కారం ఆలోచించటంలో నేనూ నా వంతు పాత్రను పోషించగలనని నాకు నమ్మకం కుదిరింది. వివిధ మతాల, వర్గాల నాయకులు సిమ్లాలో ఒకచోట చేరి అవాంఛ నీయమైన ఘటనలకు వాంఛనీయమైన పరిష్కారమార్గం వెతకటం

నాకెంతో సంతృప్తినిచ్చింది. పరమ ప్రభువు మీ ఈ ప్రయత్నాలకు తగ్గ సాఫల్యం ప్రసాదించుగాక!

మనందరి మాతృ దేశం ముఖారవిందంపై ఏర్పడిన ఈ మచ్చను కడిగి వేయటంలో ఎలాంటి లోటునూ కనబరచరాదని మీలోని దేశభక్తి భావనతో దీనంగా వినతి చేసుకుంటున్నాను. బలహీనురాలైన నా మనసు నుండి వెలువడిన ఈ వాణి నా దేశ సోదరులందరివరకూ చేరాలన్నది నా ఆకాంక్ష! నేనెంత ముసలి దాన్నయినప్పటికిన్నీ, నాకు చేతనైన సేవ-అది ఎంత అల్పమయినదైనాసరే- దేశం కోసం సమర్పించాలన్న ఆరాటం ఇప్పటికీ ఉంది. (హయాతె సుల్తానీ)

ఒక చక్రవర్తి బలం నిజమైన నేస్తాల ద్వారా పెరిగినంతగా రాజ్యం మరియు ధనం ద్వారా కూడా పెరగదు. (మనుస్మృతి: 7వ అధ్యాయం, 208వ శ్లోకం.)

మంచి గుణగణాలను అలవర్చుకోమని ఇతరులకు పిలుపునివ్వటం మానవత్వం. దీన్ని ప్రతి వ్యక్తీ పొందగలడు. అయితే ఆ సద్గుణాలను స్వయంగా ఆచరణలోకి తీసుకురావటం క్లిష్టతరం. ఈ భాగ్యం శుభాత్మలకే ప్రాప్తిస్తుంది సుమా! (హితోపదేశం- 'తమద్దునె హింద్' సౌజన్యంతో : పేజీ - 433)

## 70. ముస్లింల పరిపాలనలో....

ముస్లింలు సైనికబలంతో ఢిల్లీని వశపరచుకున్నారు. సైనికులే గంగా తీర ప్రాంతంలోవున్న రాజులను ఓడించారు. అయితే సైనికుల చేత వ్యవసాయం చేయించటం సాధ్యమయ్యే పనికాదు. అందుచేత భూములను అమీర్లకు జాగీర్ల రూపేణ అప్పగించటం జరిగింది. సేద్యం చేసేవారంతా హిందువులే. హిందూ జాగీర్దార్లను, వ్యవసాయదార్లను ముస్లింలుగా మార్చే ప్రయత్నం ఎన్నడూ జరగలేదు. ఆ ఆలోచన కూడా సుల్తానులకు వచ్చేదికాదు. ఇస్లాంను వ్యాప్తి చేయాలన్న ధ్యాస కూడా వారికుండేది కాదు. ఎందుకంటే ఉత్తర ప్రాంతంలో ఏడు వందల సంవత్సరాలు ముస్లింల పరిపాలన ఉన్నప్పటికీ హిందువులే అత్యధిక సంఖ్యలో ఉన్నారన్నది గమనార్హం. ఎందుకంటే స్థానిక

స్వపరిపాలనా వ్యవస్థ పూర్తిగా హిందువుల చేతుల్లో ఉండేది. పై అధికారులుగా ముస్లింలు కొంతమంది ఉన్నప్పటికీ మిగిలిన యంత్రాంగమంతా హిందువుల చేతుల్లోనే ఉండేది. పట్వారీ (కరణం, మునసబు), గణాంకాధికారి, కోశాధికారి వంటి హోదాలన్నీ హిందువుల చేతుల్లో ఉండేవి. ముస్లిం పరిపాలకులు హిందూ మతాన్ని చిన్నచూపు చూశారన్న వాదన తప్పని నిశితంగా పరిశీలిస్తే అర్థమవుతుంది. అల్లావుద్దీన్ ఖిల్జీ, ఫిరోజ్‌షా తుగ్లక్ వంటి సుల్తానులు దురభిమానులని చెప్పుకుంటారు. కాని వారిరువురు సయితం హిందూ మత నాయకులను ఎంతగానో ఆదరించారు. ఆచార్య మహాసేన్‌ను అల్లావుద్దీన్ కర్ణాటక నుంచి తన దర్బారుకు పిలిపించి ఇష్టాగోష్టులు జరిపినట్లు జైన ఉల్లేఖనాలలో పొందుపరచబడి ఉంది. ఢిల్లీకి చెందిన వైథ్రుజైన్ వర్గనాయకుడైన లోర్నా చంద్ర స్వయంబర యోగి రామ్‌చంద్ర సూరీ కూడా తరచూ అల్లావుద్దీన్ దర్బారుకు ఏతెంచేవారు. గియాసుద్దీన్ తుగ్లక్ దగ్గర పనిచేసే రెవిన్యూ అధికార్లలో ఇద్దరు జైన మతస్థులు కూడా ఉండేవారు. సుల్తాన్‌కు వారెంతో సన్నిహితులు. రత్న శేఖర్ అనే కవిని ఫిరోజ్‌షా తుగ్లక్ ఎంతో ఆదరించేవాడు. ఆశ్చర్యకరమయిన విషయం ఏమంటే 150 సంవత్సరాల సుదీర్ఘ కాలం పాటు ఒకవైపు ఉత్తర భారతంలో ముస్లింల జైత్రయాత్ర సాగుతున్నప్పటికీ మరో వైపు హిందూమతం బలపడసాగింది. ఎవరయినా హిందువు ముస్లిం కాదలిస్తే మాత్రం అతనికై ఇస్లాం ద్వారాలు తెరచుకునేవి. ఖుస్రో కాఠియావాడ్ వద్ద నుంచి తీసివేయబడిన ఒక దళిత బానిస ముస్లిమై నసీరుద్దీన్ అనే బిరుదుతో సింహాసనాన్ని అధిష్టించాడు. ఉన్నత పదవుల్ని పొందడానికి ఇలాంటి మహత్తర అవకాశాలుండగా హిందువులు ముస్లిములుగా మారలేదే! ఉత్తరప్రదేశ్ సుమారు 600 ఏండ్లు ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ ముస్లింల ఏలుబడిలో ఉంది. కాని అక్కడ ముస్లిం జనాభా 14 శాతం కన్నా అధికం కాలేకపోయింది. హిందూ మతం (ముస్లింల పరిపాలనా కాలంలో) సురక్షితంగా ఉందనడానికి ఇదొక ప్రబల నిదర్శనం. బలవంతంగా మతం మార్పిడులు జరిగి ఉంటే పరిస్థితి దీనికి భిన్నంగా ఉండేది. (కె.ఎం. పాణిక్కర్-ఎ సర్వే ఆఫ్ ఇండియన్ హిస్టరీ 'అహదె వస్తాకీ ఏక్ ఝలక్' సౌజన్యంతో : పేజీ-344)

# 71. చిత్తశుద్ధి ముఖ్యం

కేంద్ర జాతీయ సమైక్యతా సంఘం దేశ ప్రజల కోసం ప్రతిజ్ఞాపత్రం ఒకటి జారీ చేసింది. దాని భూమికలో ఇలా ఉంది.

ఈ ప్రతిజ్ఞా పత్రాన్ని పూర్తిగా అర్థం చేసుకోనంతవరకు దానిపై సంతకం పెట్టమని ఎవరినీ అనరాదు. భావసమైక్యత నిజానికి 'దేశ సమైక్యత'కి ఊపిరి. భారతదేశంలో సతతం మౌలికంగా భావనాపరమయిన ఐక్యమత్యం విరాజిల్లుతూ వచ్చింది. దాని ప్రాతిపదికపైన్నే దేశ సమైక్యత నెలకొంటుంది.

అయితే ప్రజలు-ప్రాంతం, భాష, మతం, రాజకీయం లాంటి విషయాలపై తలెత్తే చిన్న చిన్న వివాదాలను పెంచిపోషించడం చేత అవి సమైక్యతా మార్గంలో పెద్ద అవరోధంగా నిలుస్తాయి. భారత్ వంటి పెద్ద దేశాలలో ప్రజల మధ్య అభిప్రాయ భేదాలుండటం సహజం. అయితే ఈ అభిప్రాయ భేదాల మూలంగా జాతీయ సమైక్యత ప్రమాదంలో పడాలన్న అవసరం లేదు. ఇద్దరు అన్నదమ్ముల మధ్య వివాదం తలెత్తితే వారు తమ అభిప్రాయభేదాలను శాంతియుత పద్ధతిలో పరిష్కరించుకుంటారు. వారి మధ్య సోదర బాంధవ్యం ఉండనే ఉంటుంది. ఒకవేళ ఆ పోట్లాట హింసాపూరితమయిన స్థాయికి చేరుకుంటే సౌభ్రాతృత్వపు భావనే మిగలదు. అలాగే ఏ భారతీయుడయినా వేరొక మతంపై, కులంపై, తెగపై, భాషపై, ప్రాంతంపై దాడి జరిపితే దాని పర్యవసానంగా వారిలో ద్వేషం, ఏహ్యభావం జనిస్తాయి. వాటి నుండి ప్రతీకార భావం పుట్టుకు వస్తుంది. అంతర్యంలో వేర్పాటు బీజాలు మొలకెత్తుతాయి. దాని మూలంగా వీరు ఒకే జాతికి చెందిన వారేనా? ఒకే దేశ ప్రజలేనా? అనుకోవటమే దుర్లభమయిపోతుంది. (సియాసత్ దినపత్రిక: 2-10-1962)

# 72. ప్రేమకోరే బాధ్యత

పొరుగున ఉండే ముస్లిం పట్ల ఒక హిందువు బాధ్యత ఏమిటి? మానవత రీత్యా అతను తోటి ముస్లింతో స్నేహ సంబంధం ఏర్పరచుకోవాలి. అతని సుఖదుఃఖాలలో పాలుపంచుకోవాలి. ఆపదలో ఆదుకోవాలి. అప్పుడే

అతను తన పొరుగున ఉన్న ముస్లిం నుండి అదే విధమయిన ప్రవర్తనని ఆశించగలడు. ఏ ఊళ్లోనయితే హిందువులు మెజారిటీలో ఉంటారో, ముస్లింలు అల్పసంఖ్యలో ఉంటారో- అక్కడి ముస్లిముల ప్రాణ రక్షణకు సంబంధించిన బాధ్యతలెన్నో హిందువులపై పడతాయన్న విషయాన్ని జ్ఞాపకం ఉంచుకోవాలి. ఆఖరికి పరమతస్థులయిన దృష్ట్యా హిందువులు తమని వేరుగా చూస్తున్నారన్న అనుమానం సయితం ముస్లిములలో కలగకుండా జాగ్రత్త వహించాలి. అప్పుడే పొరుగువాని హక్కు నెరవేర్చినట్టు లెక్క. అప్పుడే హిందువులు తోటి ముస్లిముల నుండి ఏదైనా ఆశించగలగటానికి అర్హులవుతారు. అయితే కొద్ది మంది ముస్లింలు హిందువుల ఈ ఉత్తమ వ్యవహారణని అర్థం చేసుకోకుండా, అవకాశం దొరికినప్పుడల్లా పోట్లాటకు దిగి వస్తే అది వారి పిరికితనానికి ఆనవాలు. అటువంటి సందర్భంలో అధిక సంఖ్యాకులైన హిందువులు చేయవలసిందేమిటి?

ఆ సమయంలో వారు అధిక సంఖ్యాబలంతో అమానుషంగా అల్పసంఖ్యాకుల్ని లోబరచుకోవడం వారి బాధ్యత కాదు. ఒకవేళ అలా చేస్తే అది 'జులుం' అవుతుంది. 'జులుం' చేసే హక్కు వారికి లేదు. తమ సొంత సోదరుడు అమర్యాదగా ప్రవర్తిస్తే ఏ విధంగా అతన్ని వారించి సమస్య సద్దుమణిగేటట్లు చేస్తారో, అల్పసంఖ్యాకులయిన ముస్లిముల యెడల కూడా అదే విధంగా వ్యవహరించి ఉభయతారకంగా సమస్యను పరిష్కరించాలి.

-గాంధీజీ (భూదానోద్యమం సౌజన్యంతో)

# 73. విశాల దృష్టి

ఉత్తమ నడవడిక కలిగి ఉన్నంత వరకు ఏ జాతి కూడా నా దృష్టిలో అంటరానిదికాదు. జాతుల మధ్య నిమ్నోన్నతా భావాలకు కూడా తావులేదు. మానవతా రీత్యా అందరూ సమానులే అని నేను భావిస్తున్నాను.

"క్రైస్తవ మతానికి చెందిన ప్రచార సంస్థలన్నింటికీ నా రాజ్యంలో అనుమతి ఇవ్వబడింది. అన్ని మతాలలాగే క్రైస్తవ మతానికి కూడా ప్రచార స్వేచ్ఛ ఇవ్వటం జరిగింది. అంతేకాదు, వారు నడుపుతున్న అనేక పాఠశాలలకు ప్రభుత్వం నుండి సహాయం మంజూరు చేశాము.

"శిక్కు గురుద్వారాలలో ప్రాముఖ్యత రీత్యా రెండో స్థానం పొంది ఉన్న నాందేడ్ గురుద్వారా ఈ రాజ్య భాగంలోనే ఉండటం మనకు గర్వకారణం. ఈ గురుద్వారాకి కూడా రాజ్యం నుండి ఆర్థిక సహాయం లభిస్తోంది.

(వివిధ సమావేశాలలో తనకు అందజేసిన ఆహ్వాన పత్రాలకు నిజాం నవాబు పంపిన జవాబు)

## 74. చేతల్లో చూపాలి

"ఐక్యత లేక ఏకత్వం అనేది కేవలం మాటల్లో ప్రదర్శిస్తే విముక్తి లభించే విశ్వాసం కాదు. ఆచరణాత్మక జీవితంలో స్నేహం, సౌభ్రాతృత్వం మరియు సేవాపరాయణత్వం కలిగి ఉంటేనే ఐక్యత ఏర్పడుతుంది. ఈ విషయానికి సంబంధించినంతవరకు మనదేశం కన్నా దురదృష్టం గల దేశం మరొకటి లేదని నేననుకుంటున్నాను.

ఐకమత్యం లేక ఏకత్వం అనే పదాల నిఘంటువు అర్థానికి ప్రాముఖ్యం లేదు. దానిని నిజభావం భావుకతతో ఆచరణతో ముడిపడి ఉంది. నిజ జీవితంలో మన ఆచరణ ద్వారా ఐకమత్యపు సాక్ష్యమిచ్చేంత వరకు ఈ పదాలు మన నోట వెలువడనేకూడదు.

"దేశ సమైక్యత" అనే అంశంపై బనారస్‌లో జరిగిన సాహితీ సదస్సు అధ్యక్షోపన్యాసం.

-నియాజ్ ఫతేపూరి, జనవరి 1962

## 75. జాతీయ సమైక్యతా మండలి ప్రమాణం

"భారత దేశపు ఒక పౌరునిగా, వివిధ సామూహిక వ్యవస్థల మధ్య, సంస్థల మధ్య, పౌరుల వివిధ వర్గాల మధ్య ఏ వివాదం తలెత్తినా అది శాంతియుత మార్గాల ద్వారా పరిష్కృతం కావాలన్న విశ్వజనీన సూత్రం పట్ల నా నమ్మకాన్ని ప్రకటిస్తున్నాను. దేశ సమైక్యతకు ముంచుకొస్తున్న ముప్పు దృష్ట్యా నేను ఏ వివాదాస్పద విషయంలో కూడా హింసకు పాల్పడబోనని, ఈ వివాదాలు నా ఇరుగుపొరుగులో జరిగినా, దేశంలోని మరో భాగంలో ఎక్కడ జరిగినా సరే హింసా మార్గాన్ని అవలంబించబోనని ప్రతిజ్ఞ చేస్తున్నాను."

# 76. సాహసానికి ఆనవాలు

ఒక మంచి మనిషి నన్ను కలుసుకోవడానికి వచ్చారు. డెహ్రాడూన్ నుండి వచ్చారాయన. ఆయన చెప్పిన ఒక సంఘటన నన్ను కలచివేసింది. జరిగిన వాస్తవాన్ని ఆయన ఇలా వివరించారు- "నేను ప్రయాణం చేస్తున్న రైలు పెట్టె హిందువులు, శిక్కులతో నిండిపోయింది. అంతలో ఆ రైలు పెట్టెలోకి ఓ కొత్త వ్యక్తి ప్రవేశించాడు. ప్రయాణీకులంతా ఆ వ్యక్తిని వాకబు చేశారు. తాను మాదిగ కులస్తుడనని చెప్పాడా వ్యక్తి. అయితే అతని చేతిపై ఉన్న పచ్చబొట్టును బట్టి ఆ వ్యక్తి ఖచ్చితంగా ముస్లిం అని నిర్ధారించుకున్నారు. అంతే, వెంటనే అతన్ని కత్తితో పొడిచి చంపి యమునా నదిలోకి త్రోసివేశారు." ఈ దృశ్యాన్ని కళ్ళారా చూసిన తన శరీరం జలదరించిందని, తాను ఎంతో బాధపడ్డానని ఆయన అన్నారు. కాని ఆయన ఏమీ చేయలేకపోయారు. ఆ ముస్లిం సోదరుణ్ని ప్రాణాలొడ్డి అయినా సరే ఎందుకు కాపాడలేకపోయారని నేను ఆయన్ని ఒత్తిడి చేశాను. ఆయన ఆ సాహసమే చేసి ఉంటే ఎంత బాగుండేది? చనిపోయిన ఆ సోదరుణ్ని కాపాడి ఉండేవారేమో. ఒకవేళ అతన్ని రక్షించబోయి ఉంటే ఖుద్దుగా ఈయన ప్రమాదంలో పడేవారేమో- అదీ సంభవమే. అయితే సాహసుల అహింసా తత్వానికి నిదర్శనం ఇదే- పరులను రక్షించేందుకు ప్రమాదాలను ఎదురొడ్డడం. ఈయన ఈ సాహసానికే గనక పూనుకొని వుంటే, ఆ రైలు పెట్టెలో ప్రయాణం చేస్తున్న మంచి వారిలో కూడా సాహసం జనించి ఉండేది. వారు సైతం ఆ మంచి పనికి, సాహస కార్యానికి చేయూతనిచ్చి ఉండేవారేమో!

- గాంధీజీ (1947 అక్టోబర్ 8న ప్రార్థనా సమావేశంలో)

# 77. యదార్థవాది

హిందువులతో అతని (టిప్పు సుల్తాన్) సంబంధాలు స్నేహపూరితమైనవి. అతని సాహస విన్యాసాలను తెలుసుకుని హృదయం సంతోషంతో పులకిస్తుంది. విదేశీ శత్రువు తమ గడ్డపై తిష్ఠవేసి ఉన్న తరుణంలో ఇక్కడి హిందూ ముస్లిములు బాధ్యతను విస్మరించి పరస్పరం పోరాడుకుంటూ ఉండటాన్ని మనం చరిత్ర ద్వారా తెలుసుకోగలము. మహా మనిషి టిప్పు సుల్తాన్ దగ్గర ఒక

హిందువు ప్రధాన మంత్రిగా ఉండేవాడు. ఏ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం సుల్తాన్ పోరాటం సాగించాడో వాటికి వెన్నుపోటు పొడిచి ఈ ప్రధానమంత్రి శత్రువులకు లొంగిపోయిన వాస్తవాన్ని మనం అంగీకరించక తప్పదు. -గాంధీజీ

## 78. మందిరాల విధ్వంసం అక్రమం

"పరమతస్థుల ఆరాధనాలయాలను ధ్వంసం చేయడం అన్నది మన పవిత్ర షరీఅత్ ప్రకారం నిషిద్ధం, విరుద్ధమయిన విషయం. సత్యధర్మం సుత్రానుసారం ఇది అధర్మం కూడా. బనారస్‌లోని అధికారులు కొందరు చుట్టుపట్ల నివసించే హిందువులపై దౌర్జన్యానికి పాల్పడుతున్నారని, వారి మత సంబంధమయిన విషయాలలో జోక్యం చేసుకుంటున్నారని నాకు తెలిసింది. పురాతన మందిరాల సేవతో ముడిపడి ఉన్న బ్రాహ్మణులకు వారు తీసుకున్న హక్కులను అనుభవించకుండా చేస్తున్నారన్న ఆరోపణ కూడా నా దృష్టికి వచ్చింది. ఇక ఏ ఒక్కరూ హిందువులనుగాని, బ్రాహ్మణులనుగాని కష్టపెట్టరాదని, వారిపై ఏ విధమయిన దౌర్జన్యానికి పాల్పడరాదని ఇందుమూలంగా ఆజ్ఞాపించడమయినది. (బనారస్ అధికారి అబుల్ హసన్ పేర ఔరంగజేబు జారీచేసిన ఫర్మానా)

-నిరంజన్‌సేన్ (25 జమాది ఉల్ అవ్వల్, హిజ్రీ 1026)

## 79. అమానతు

ఇప్పుడు నేను ముఖ్యంగా హిందూ సోదరులనే సంబోధించదలిచాను. సాధారణంగా హిందువులు మెతక మనస్కులుగా పరిగణించబడతారు. వారు త్రాచుపాముకు పాలుపోస్తారు. చీమలకు చక్కెర పెడతారు. హిందువులు ఎంతటి దయార్ద్ర హృదయులో చెప్పడానికే ఈ దృష్టాంతాలు. విష సర్పాలన్నా వారికి ద్వేషం లేదు. పైగా వారి ప్రేమ సర్వతోముఖమయింది. కనుక వారిలో ద్వేషం, కోపం, ప్రతీకారాల ప్రశ్నే తలెత్తదు. ఇది ఋషులు, మహర్షులు, మునుల నుండి హిందువులకు సంక్రమించిన బోధనా పరంపర.

రావణాసురుని తమ్ముడు విభీషణుడు రాముని దగ్గరకు వచ్చి, సీతమ్మను చెర నుండి విడిపించడంలో రామునితో సహకరిస్తానని వాగ్దానం చేశాడు.

అందుకు రాముడు సంతోషించి, రావణ సంహారం తరువాత విభీషణుణ్ని లంకకు అధిపతిగా చేయడం జరుగుతుందని సెలవిచ్చాడు. ఇది విన్న ఒక ప్రేక్షకుడు, ఒకవేళ రావణుడు ఆయుధాలు పడవేసి శరణువేడితే అప్పుడు మీరేం చేస్తారని రాముని ప్రశ్నించాడు. దానికి రాముడిచ్చిన సమాధానం గమనార్హం. "అప్పుడు రావణుడు లంకకు రాజుగానే ఉంటాడు. పోతే విభీషణుడ్ని అయోధ్యకు రాజుగా నియమిస్తాను."

ఈ ఇతిహాసం ద్వారా మనకు లభించే గుణపాఠం ఏమిటి? (మైనారిటీలయిన) ముస్లింలు ఆయుధాలు అప్పగించి మన రక్షణ కోరినప్పుడు వారిని కంటికి రెప్పలా కాపాడటం మన బాధ్యత అయిపోతుంది. ఆ మాటకు వస్తే ఏ దేశంలోనైనా సరే అల్పసంఖ్యాకులు ఓ అమానతు అప్పగింతగానే ఉంటారు. మనమిప్పుడు హైదరాబాదులో ముస్లిముల అమానతుదారులము. మన స్థితి మారింది, దీన్ని మనం గుర్తించాలి. మన హిందూ సోదరులకు నేనొక విషయం విన్నవించదలిచాను. దౌర్జన్యపరులమని, తీవ్రవాదులమని భావించే అవకాశం ముస్లిములకు మనం కల్పించకూడదు.

మనం స్వాతంత్ర్యం సాధించి ఏడాది దాటిపోయింది. రెండో సంవత్సరం ప్రారంభమయ్యింది. ఒక ఏడాది కాలంలో మనం ఎలా వ్యవహరించాము, తోటి ముస్లిముల పట్ల మన వ్యవహరణ ఎలా ఉండింది అన్న విషయాన్ని ఆత్మావలోకనం చేసుకోవాలి. సవ్యంగా, నిష్కల్మషంగా ఉందని మన అంతరాత్మ నుండి మనకు సమాధానం లభిస్తే లోకేశ్వరుడికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. అంతరాత్మ నుండి అలాంటి సమాధానం రాని పక్షంలో మనం మన తప్పుల్ని సరిదిద్దుకోవాలి. -నరసింగరావు, రయ్యత్ సంపాదకుడు, (మంజిల్ సౌజన్యంతో)

# 80. ఆ రోజులు మళ్ళీ వస్తాయి

ఒకనాడు హిందూ ముస్లింలు పరస్పరం స్నేహం కోసం పడిచచ్చేవారు. ఒండొకరి సుఖదుఃఖాలలో పాలుపంచుకునేవారు. పాలు తేనెల సంగమంలా ఉండేవి ఒకనాటి వారి జీవితాలు. నేటికీ హిందువులూ ఉన్నారు- ముస్లిములూ ఉన్నారు. కాని సమయ సందర్భాలతోపాటు మనమూ మారిపోయాము.

అయితే ఏనాటికైనా ఇరువర్గాల హృదయాలు కలుస్తాయని నా మనస్సాక్షి చెబుతున్నది. ఆ ఆత్మవిశ్వాసం నాకున్నది. ఈ రోజు అసంభవంగా కనిపిస్తున్న దాన్ని రేపు పరమాత్ముడు సంభవంగా, సులభసాధ్యంగా చేసివేస్తాడు. ఈ సదుద్దేశ్యంతోనే, ఆ శుభవేళ కోసమే నేను పనిచేస్తున్నాను. ఈ లక్ష్య సాధన కోసమే జీవించి ఉన్నాను. దాని కోసమే ప్రార్థిస్తుంటాను.

-గాంధీజీ 'హరిజన్' 7-10-1939లో

# 81. శాంతియుత వాతావరణం అవసరం

న్యూఢిల్లీ, డిశంబరు 29.

మహ్‌రౌలి మరియు ఢిల్లీ పరిసర ప్రాంతంలో ఒక లైబ్రరీ ప్రారంభోత్సవ సందర్భంగా సర్దార్ పటేల్ ఒక పెద్ద జన సమూహాన్నుద్దేశ్యించి ప్రసంగిస్తూ ఇలా అన్నారు- "ఈ ప్రాంతంలో ముస్లింలు పెద్ద సంఖ్యలో నివసించేవారు. కాని వారంతా ఇప్పుడు ఇక్కడి నుంచి వలసపోయారు. ఢిల్లీ నగర పరిస్థితి కూడా ఇలాగే ఉంది. ఈ పరిస్థితి అత్యంత శోచనీయమైనది. దీనివల్ల ప్రపంచ దేశాలలో భారతదేశం ప్రతిష్ఠ మంటగలసిపోతోంది. భారతీయులు కనీసం తమ ఇంటిని కూడా చక్కదిద్దుకునే స్థితిలో లేరని విదేశీయులు మనల్ని ఎద్దేవా చేస్తున్నారు. ప్రతి ముస్లిం ఇక్కడ తనను సురక్షితంగా భావించే వాతావరణాన్ని సృజించేందుకు ప్రయత్నించండి." (సిద్ధె జదీద్: లక్నో- 9-1-1948)

# 82. యదార్థం

1. ముస్లిముల్ని ఈ దేశ పాలకులు అనటంకన్నా, వారిని- ఈ దేశ సంస్కృతీ, నాగరికతల ఉత్పత్తి అనడం సబబు.

2. పూర్వం హిందూ ముస్లిముల పరస్పర సంబంధాలలో ఉద్రిక్తత అనేది లేదు. వారు ఒండొకరి భావోద్రేకాలను గౌరవించేవారు. మతకలహాలనేవి ఆనాడెక్కడా వినవచ్చేవి కావు, కానవచ్చేవి కావు.

3. అసంఖ్యాకమయిన రామమందిరాలు, కృష్ణమందిరాలు ఇస్లామీయ యుగంలో నిర్మించబడ్డాయి.

4. ముస్లిం పాలకులు ఖడ్గంతో పాలించే వారైనప్పటికీ హిందువుల మత భావాలను, ఆఖరికి వారి మూఢనమ్మకాలను సయితం గౌరవించారు. సతీసహగమనం వంటి అమానుషమయిన దురాచారానికి కూడా వారి హయాంలో ఎలాంటి ఆటంకం ఉండలేదు. భోజన విషయాలలో కూడా హిందువుల తారతమ్యాలను వారు భరించారు. చివరికి హిందువుల సమక్షంలో వారు అంటరానివారుగా మెలగటం కూడా నిగ్రహించుకున్నారు.

(రోహిల్‌ఖండ్ పత్రిక్, బరేలి -యు.పి.)

## 83. హితబోధ

"ప్రభుత్వ శాసనాలను, విధానాలను ఖాతరు చేసే ఏ మతవర్గపు మందిరాన్నిగాని, ఆరాధనా గృహాన్నిగాని పడగొట్టరాదు. ప్రజల మధ్య న్యాయం చెయ్యి. న్యాయస్థాపన కోసం నువ్వు అవలంబించే విధానాలు, ప్రజలు రాజుతో ప్రసన్నమయ్యే విధంగా, రాజు ప్రజలతో సన్నిహితమయ్యే విధంగా ఉండాలి సుమా! ఇస్లాం ఆశయ సిద్ధి అనేది బలంతోకాక మంచి పనులు, పరోపకారంతో కూడిన ఖడ్గంతోనే సాధ్యపడుతుంది." -యువరాజు హుమాయున్‌కు బాబర్ చక్రవర్తి హిజ్రీ 935 జమాది ఉల్ అవ్వల్ 1న రాసిన లేఖ.

## 84. ఆకాంక్ష

హిందూ-ముస్లింలు చిత్తశుద్ధితో తమ తమ ధర్మాలను అవలంబిస్తూ, ఒండొకరి ధర్మాల పట్ల సదవగాహన కలిగి ఉంటే ఇక్కడ ఏ గొడవా ఉండబోదని నేను మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను. ఒకవేళ నా శవం మీద హిందూ-ముస్లిం ఐకమత్యపు కట్టడం నిర్మితమవుతుందనుకుంటే అది నా కొరకు గర్వ కారణంగా భావిస్తాను. (పండిట్ సుందర్‌లాల్ - 'హిందూ ముస్లిం ఏక్తా' నుండి)

# 85. ప్రేమ పరిమళం

ఆ రోజులు వేరు. అనాడు ఒక ఫకీరు వచ్చి ఒక మూలన కూర్చునేవాడు. లక్షలాది మంది హిందూ ముస్లింలు అతని ముందు తలవంచేవారు. అతని దయార్ద్ర హృదయతని, సదాచరణని చూసి ప్రజలు ఆకర్షితులయ్యేవారు. అతడు సత్యానికి, సచ్ఛీలతకి ప్రతీక. ప్రజలు వచ్చి అతన్ని అడిగేవారు.

'షాహ్ సాహెబ్! మేము ముస్లిములం కాదలిచాం, అనుమతించండి' అని.

"సత్యం పలకండి, నిజాయితిగా మెలగండి, నమ్మకద్రోహం చెయ్యకండి. ఎవరయితే వీటికి కట్టుబడి ఉంటారో వారంతా ముస్లిములే" అనేవారు షాహ్ సాహెబ్.

-సుందర్ లాల్

# 86. ఆ రోజుల్లో...

రయీస్ అహ్మద్ జాఫరీగారు "బహదుర్ షా జఫర్- ఆయన కాలం" అనే తన పుస్తకంలో మౌల్వీ జకావుల్లా ఆధారంగా ఇలా వ్రాశారు-

బహదుర్ షా జఫర్‌గానీ, ఆయన పూర్వీకులైన పాదుషాల సౌభ్రాత్రత భావాల వల్లగానీ హిందూ-ముస్లింల మధ్య నిజమైన ప్రేమైకభావాలు చిగురించాయి. ఫాదర్ సి. ఎఫ్. ఆండ్ర్యూస్ అభిప్రాయపడినట్లు:

ఆ రోజుల్లో ఇరువర్గాల వారు ఒండొకరి పండుగల్లో, ఉత్సవాల్లో పాల్గొనేవారు. ముస్లింలు హిందువుల పండుగలలో పాల్గొనేవారు. ఇది ఒక ఆచారంగా మారిపోయింది. ఎవరో కొందరు కరడుగట్టిన భావాలు గలవారు తప్ప ఇలాంటి స్నేహపూరిత సంబంధాలపై వేలెత్తే వారెవరూ ఉండేవారు కారు.

ముస్లింలు కొంతమంది హిందూ సన్యాసులను ఎంతగానో గౌరవించే వారు. మొగలాయి చక్రవర్తులు, దర్బారు ప్రముఖులు మహనీయులను సందర్శించారన్నదానికి ఆనాటి కొన్ని చిత్రాలు సాక్షిగా నిలిచి ఉన్నాయి. హిందువులు కూడా ఢిల్లీ సమీపంలో వున్న సుప్రసిద్ధ మజారె షరీఫ్‌ను

సందర్శించేవారు. ఢిల్లీ గేటు ఆవల వున్న ఖాజా నిజాముద్దీన్ ఔలియా సమాధిని హిందువులు శుభశ్రేయాల సంకల్పంతో సందర్శించేవారు.

అలాగే ఉర్దూ, పారసీక భాషలలో ఎన్నదగ్గ రచయితలుగా చెలామణీ అయ్యే హిందువులు తమ రచనలో "బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్" తో ప్రారంభించేవారు. ఒక విధంగా ఇదో కొత్త పోకడ. మస్జిదులతో ముడిపడి వున్న బడులకు పెద్ద సంఖ్యలో హిందువుల పిల్లలు వెళ్ళేవారు. ఆ మదర్సాలలో వారు అరబీ పారసీక భాషలను నేర్చుకునేవారు. పారసీక భాషను కవిత్వపు భాషగా వారు అభిమానించేవారు. నేటికీ ఢిల్లీలోని కొన్ని కుటుంబాలలో పారసీక భాష నేర్చుకోవటం ఆనవాయితీగా వస్తోంది. హిందువుల సంభాషణలో పారసీ కవిత్వం అంతర్వాహినిలా ప్రవహించేది. ఈ పారసీక మాధ్యమంతోనే బహుశా ఢిల్లీ హిందువులు ఇస్లామీ తసవ్వుఫ్ (వేదాంతం)కు దగ్గరయ్యారు. ఆత్మతృప్తి, ఆధ్యాత్మిక వికాసం రీత్యా ఇది హిందూ వేదాంతానికి అత్యంత సన్నిహితమైనది.

హిందువుల పండుగలు వచ్చినప్పుడు హిందూ బాలలు తమ వంటకాలను తెచ్చి మదర్సాల మౌల్వీలకు కానుకలుగా ఇచ్చేవారు. అధ్యాపకులను తమ ఇళ్లకు విందుకు ఆహ్వానించేవారు. ఇలాంటి ఆహ్వానాలను సంతోషంగా స్వీకరించటం కూడా రివాజుగా ఉండేది. ముస్లిములు కూడా హిందూ పర్వదినాల గురించి ఎంతో మర్యాదపూర్వకంగా ప్రస్తావించేవారు. హిందువుల మనోభావాలకు దెబ్బతగిలే చిన్న మాట కూడా తమ సంభాషణల్లో దొర్లకుండా జాగ్రత్త వహించేవారు.

సామాజిక ఉత్సవాల సందర్భంగా ముఖ్యంగా వివాహాది శుభకార్యాలు జరిగినప్పుడు వారు తమ హిందూ మిత్రులకు కానుకలు పంపేవారు. తమ ఇళ్లల్లో జరిగే వివాహాది కార్యాలకు హిందువులను పిలిచేవారు. హిందువులు ఇలాంటి మహోత్సవాలకు రావటమేగాక వధూవరులకు శుభాకాంక్షలు తెలిపేవారు. కానుకలు సమర్పించేవారు. పండుగ సమయాలలో, ముఖ్యంగా రమజాన్ పండుగ సందర్భంగా హిందువులు ముస్లింలకు శుభాకాంక్షలు తెలుపుకునేవారు. ముస్లింలు కూడా ప్రేమాతిశయంతో ఈ శుభాకాంక్షలకు

స్పందించేవారు. వివిధ మతస్థులైన ఇరుగుపొరుగువారి పట్ల సామరస్యంతో జీవితం గడిపే పద్ధతి సమాజంలో బాగా వ్రేళ్లూనుకుపోయింది.

వృద్ధుడైన బహదుర్ షా తన జీవితపు ఆఖరి ఘడియల వరకూ ఈ రీతి రివాజులకు కట్టుబడి ఉన్నాడు. ఆయన షాహీ ఏనుగులపై కూర్చుని, ఊరేగింపుగా వచ్చి ఎర్రకోట బురుజుపై కూర్చునేవాడు. అక్కడి నుంచి హిందూ-ముస్లింల పండుగ ఉత్సవాలను తిలకించేవాడు. పాదుషాను చూసి ప్రజలు ఆనందంతో, ఉత్సాహంతో సంబరాలను జరుపుకునేవారు. ఈ విధంగా ఇరువర్గాల ప్రజల మధ్య సోదరభావం వెల్లివిరిసేది. ఈ సందర్భంగా పాదుషా తానిష్టపడే గజళ్లు వినిపించగా, ప్రజలు ఆనందంతో కరతాళధ్వనులు చేసేవారు.

నగరమంతా సెలవు పాటించే ఇలాంటి శుభ సందర్భాలలో మొగల్ యువరాజులు అలంకరించబడిన గుఱ్ఱాలపై కూర్చుని నగర వీధుల్లో గస్తీ చేసేవారు.

ఇలాంటి సామరస్యపూర్వకమైన వాతావరణం ఫలితంగా రెండు పెద్ద మత వర్గాలైన హిందూ-ముస్లింలకు స్పష్టంగా బోధపడింది- ఒండొకరి సుఖదుఃఖాలను పంచుకోవలసిన బాధ్యత తమపై ఉందని! బహదుర్ షా జఫర్ సారథ్యం ఉన్నంత వరకూ ఇరువర్గాల వారిలో ఈ బాధ్యతా భావన జాగృతమై ఉండేది.

ఫాదర్ సి.ఎఫ్. ఆండ్ర్యూస్ ఇంకా ఇలా అంటున్నారు: ఢిల్లీకి చెందిన సనాతన హిందువుల వద్దకు సమాచార సేకరణ నిమిత్తం నేను వెళ్ళినప్పుడు, చివరి మొగల్ పాదుషాలు తమ పట్ల ఎంతో మర్యాదగా మెలిగారని వారు తడబాటు లేకుండా చెప్పారు. ఇతరత్రా విషయాలలో మొగల్ చక్రవర్తులకు వ్యతిరేకంగా చాలా చెప్పవచ్చు. అయితే మొత్తమ్మీద వారిని మంచివారుగా అభివర్ణించటమే న్యాయం. ఎందుకంటే వారు మత దురభిమానాన్ని జయించారు. ఈ కారణంగానే వారు హిందూ ప్రజల పట్ల దయాదాక్షిణ్యాల వైఖరిని అవలంబించ గలిగారు. నిష్పక్షపాతంగా న్యాయనిర్ణయాలు చేశారు. తాము

తమ మతం విషయంలో ఎంత సున్నిత మనస్కులై ఉంటారో, హిందూ మతం విషయంలో కూడా అంతే సున్నితంగా మసలుకోవాలనీ, హిందువుల మనోభావాలను గాయపర్చే చేష్టలకు పాల్పడరాదనీ వారు తమ దర్బారు ప్రముఖులకు గట్టిగా తాకీదు చేసేవారు. ఒక్కోసారి కొంతమంది అజ్ఞానుల మూర్ఖత్వం మూలంగా అక్కడక్కడా మత వైషమ్యాలు పొడసూపి అవాంఛనీయ సంఘటనలు జరిగేవి. అయితే అలాంటి గొడవలు అక్కడికక్కడే సద్దుమణిగేవి. అలజడులను అణచివేసి శాంతిని ఎలా నెలకొల్పాలో మొగల్ చక్రవర్తులకు బాగా తెలుసు.

-(జకావుల్లా, ఢిల్లీ ఆధారంగా)

# 87. రాజీ మతం

"ఒక పరిపాలకునిగా నేను మరొక మతాన్ని అవలంబించవలసి వస్తుంది. ఆ మతాన్ని 'రాజీమతం'గా వ్యవహరించవచ్చు. ఎందుకంటే నా ఏలుబడిలో వివిధ మతాలవారు, విభిన్న తెగలకు చెందినవారున్నారు. వారందరి బాగోగులను పర్యవేక్షించవలసిన బాధ్యత నా ప్రభుత్వంపై ఉంది."

(ఆలా హజ్రత్ ఉస్మాన్ అలీఖాన్ ఫర్మానాలోని ఒక భాగం. 12 జుమాదివుస్సాని 1352 హిజ్రీ)

# 88. కృతజ్ఞత

"అంటరానివారి బడుగుతనాన్ని, వారి హృదయాల్లో దాగిన న్యూనతా భావాన్ని పారద్రోలడానికి నిజాం ప్రభుత్వం అన్ని విధాలా శ్రద్ధాసక్తులు కనబరుస్తున్నందుకు ఈ సభ కృతజ్ఞత చెప్పుకుంటోంది. ముఖ్యంగా విద్యా విషయంలో అస్పృశ్యుల కోసం నిజాం ప్రభుత్వం నెలకొలిపిన పాఠశాలల దృష్టాంతం భారత దేశంలోనే లేదు. నిజాం నవాబుగారి ఉన్నత భావాలను ఇతర సంస్థానాధీశులు కూడా అనుకరించాలని ఈ సభ విజ్ఞప్తి చేస్తోంది."

ఇది, అక్టోబర్ 1931లో డా. అంబేద్కర్ నాయకత్వంలో అస్పృశ్యుల ప్రతినిధి వర్గం ఒకటి రౌండ్‌టేబుల్ సమావేశంలో పాల్గొనడానికి లండన్ వెళ్ళినప్పుడు ఆ ప్రతినిధి సంఘం లండన్ నుండి నిజాం నవాబు పేరిట పంపిన టెలిగ్రాం.

-'జష్నె ఉస్మానీ' పేజీ:109

## 89. సమైక్యత అంటే

దైవకృప వల్ల భారతదేశంలో రెండు ప్రధానమయిన వర్గాలవారు ఏ విధంగా నివసిస్తున్నారంటే, ఒకరి ఇల్లు మరొకరి ఇంటిని ఆనుకొని ఉంది; ఒకరింటి గోడ నీడ రెండోవారింట్లో పడుతుంది. ఒకే గాలి, ఒకే నీరును ఇరువర్గాలు అనుభవిస్తున్నాయి. ఒకే నది నీటిని త్రాగుతున్నారు. జీవన్మరణాలు, సుఖ దుఃఖాలలో ఒండొకరికి అండగా ఉంటున్నారు. సమాజపరంగా ఏ విషయంలో నైనా ఇరువర్గాలు వేర్వేరుగా, ఎడమొగం పెడమొగంగా మారారంటే ఒండొకరి వినాశాన్ని కొనిదెచ్చుకున్నారన్నమాటే.

ఇప్పుడు భారత దేశమే ఇరువురి దేశం. భారత దేశం గాలిలోనే ఉభయులం జీవిస్తున్నాము. పవిత్ర గంగా, యమునల నీటిని ఉభయులం త్రాగుతున్నాము. భారత దేశంలో పండిన ధాన్యాలనే ఉభయులం తింటున్నాము. జీవన్మరణాలు మన సమిష్టి విషయం. భారతదేశంలో జీవిస్తూ ఉభయుల రక్తం మార్పిడి జరిగింది. ఇద్దరి రంగులు ఏకమైనాయి. ఉభయుల రూపాలు మారి ఒండొకరి పోలిక ఏర్పడింది. అసంఖ్యాకమయిన హిందూ ఆచారాలను ముస్లింలు స్వీకరించారు. ముస్లిముల అలవాట్లనెన్నింటినో హిందువులు గ్రహించారు. ఇక్కడ ఉభయులు కలసి ఒక భాషను రూపొందించుకున్నారు. అంతకు ముందు అది మాదీ కాదూ వారిదీ కాదూ. - సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్

-: సమాప్తం :-